# వీరజ్యోతి

Veera · Jyothi

కవిచంద్రులు :

కోట సోదర కవులు

Kota Sodara Kavulu

ప్రకాశకులు :

కృష్ణా అండ్ కో.,

పబ్లిషర్సు, నెల్లూరు

1954

ప్రవెల : 1–0–0

# వి న్న ప ము

ప్రభుత్వము నిర్ణయించిన నూతన దేశభాషా ప్రణాళిక నాధారముగా 4, 5, 6 ఫారముల విద్యార్థుల యుపయోగార్థముగా నీ " వీరజ్యోతి " ఉపవాచకమును రచించితిమి.

ఇందలి కథాంశములు, పౌరాణిక, చారిత్రక, నైతిక, సాంఘికముగా మార్గదర్శకులైన మహావీరుల ధన్యజీవితములు, కర్ణుని వీర దాతృత్వము, రాణాప్రతాపుని దేశాభిమానము, విశ్వనాథనాయకుని ప్రతిజ్ఞాపాలన, సోక్రటీసు ఆత్మార్పణ, రామమోహనుని సాంఘికసేవాపరాయణత, పొట్టి శ్రీరాముల త్యాగశీలము, ద్యోతకములగుచున్న యంశములను నేటి విద్యార్థి లోకమలవఱచుకొని, చారిత్రక ప్రసిద్ధిఁగన్న మాతృదేశ కీర్తి సౌభాగ్యమును జిరస్థాయిఁ గావించి ధన్యులగుదురని మా యభిప్రాయము.

ఈ యుపవాచకము విద్యావేత్తల యాదరము గడించిన గృతకృత్యులమగుదుమని విశ్వసించుచున్నాము.

కనిగిరి,
జయ, భాద్రపద[illegible]

[illegible]రచయితలు.

# విషయసూచిక

# ౧. వీరదాతృత్వము

కుంతిభోజుఁడను మహారాజున కనుంగు కూతురు కుంతి. ఆమె మిగుల సౌందర్యవతి. ఒకానొక దినమున తమ ప్రాసాదము కతిథిగా నరుదెంచిన దుర్వాసమహర్షికి, కుంతి భక్తిశ్రద్ధలతో నతిథి సత్కారము లొనర్చినది. ఆ మహర్షి సంతోషమునకు బాత్రురాలైనది. దుర్వాసుఁడు సంతుష్టుఁడై సూర్యుని బ్రసన్నుని జేసికొనుట కనువగు మంత్ర ముపదేశించి పోయెను.

ఒకనాఁ డేకాంతమున గుంతి కుసుమోద్యానమున విహరించుచుండెను. తేజోవిరాజితుఁడై మింట వెలుఁగు చున్న భాస్కరుని జూచినది కుంతి. బాల్యచాపల్యమున మంత్రప్రభావమును బరీక్షింపఁ గోరినది. వెంటనే యామె సూర్యు నారాధించెను. భానుఁడు సుందర విగ్రహుఁడై యామె యెదుట సాక్షాత్కరించినాఁడు. ఆమె సిగ్గుచే తల వంచుకొన్నది. అంత సూర్యుఁడు సహజ కవచకుండల ములచేఁ బ్రకాశించు నొక కుమారుని బ్రసాదించి వెడలి పోయెను.

కన్నెయైన తనకు మాతృత్వము సంభవించినందుకు సాంఘికముగా నపవాదము సంభవించునను బెంగ పెట్టు కొన్నది. హఠాత్తుగా దనకుఁ బ్రాప్తించిన యీ విపరీత చర్యచేఁ గలిగిన మనోవేదనను భరింపలేదు, తల్లిదండ్రుల

కీవార్తఁదెలుప సాహసింపను లేదు. ఇట్టియవస్థలో శిశువుతో గూడ ప్రాణత్యాగముచేయుటయే కర్తవ్యమని కుంతి తలఁచినది. ముద్దుబిడ్డను చేతులతో నెత్తి మెలమెల్లగా నుద్యానవనమందలి సౌధసోపానములనుండిదిగినది. లోకాప వాదభీతి యొకవైపునకులాగ, బిడ్డపై ప్రేమ మఱొక వైపు నకులాగఁ, గుంతి క్రుంగిపోయినది.

ఎటులో మనసు చిక్కఁబట్టుకొని, సమీపమున ప్రవహించుచున్న నదికామె బిడ్డతోఁ జేరఁబోయినది. నదీ ప్రవాహమునగొట్టుకొనివచ్చు నొకపెట్టె కుంతి కన్నులకుఁ గోచరమైనది. శిశుహత్యాదోషముతో నాత్మహత్యా పాపమును జతగూర్చుట హేయమని తలఁచినది కుంతి. పొదరిండ్ల చిగురుటాకులు పొత్తిళ్లుగా గూర్చి, మందసములో శిశువును భద్రపఱచి, ప్రవాహజలములఁబోవిడిచెను. మెల్లఁగా నానది గంగాప్రవాహముతోఁ గలిసినది.

రాజపుత్రికయైనను దాను, బిడ్డ నల్లారుముద్దుగా బెంచుకోలేనిస్థితికి వగచి, కుంతి నదీదేవతను, ప్రకృతి మాతను, సూర్యదేవుని, మనసార శిశువును రక్షింపఁ బ్రార్థించినది. పుట్టెడు దిగులుతో కుంతి నిజమందిరమున కేగినది.

ఆకాలమున హస్తినాపుర రాజధానిగా భరతఖండ మును బాలించు ధృతరాష్ట్రునకు మిత్రుఁడు చిత్రరథుఁడను నతఁడుండెను. ఆతఁడు సూతుఁడు. ఒకనాఁడాతఁడు తన భార్యయగు రాధతో గంగాస్నానమున కరుదెంచెను.

ఆనాఁడు నదీప్రవాహమున గొట్టుకొనివచ్చు పేటిక యా సూతదంపుతుల నయనగోచరమైనది. వెంటనే సూతుఁడా పెట్టెనుబట్టి, తెఱచిచూడఁగా నందొక బాలుఁడు రెండవ సూర్యునివలె విరాజిల్లుచుండెను.

వారాబాలుని మిగులప్రేమతో నిజగృహంబునకుఁ గొనిపోయిరి. సంతాన కాంక్షతో వ్రతములుసలిపి, వేయి దేవుళ్ళకు మ్రొక్కిన సూతదంపతులు తమనోములు ఫలించిన దని సంతసించిరి. దైవ ప్రసాదమున లభించిన ముద్దులు మూటగట్టునీ బాలునిఁ గన్నకుమారునికన్న మిన్నగా బెంచు కొనుచుండిరి. ఆ బాలునకు కర్ణుఁడను పేరుగాక, రాధచేఁ బెంపఁబడుచుండుటచే రాధేయుఁడను నామము ప్రసిద్ధమైనది.

రాధేయుఁడు కాలక్రమమున వృద్ధియైనాఁడు. తన యీడుజోడు పిల్లలతో నాటలాడుచుఁ దల్లిదండ్రుల కన్నుల పండువుగా మెలఁగుచుండెను. పెంపుడు కుమారుని జూచు కొనుచున్న రాధ హృదయగోళమందు పండువెన్నెలగురియు జాబిల్లి కళాతీతుడైనాఁడు. కర్ణుని వయసుతో సరితూగుచు విద్యాబుద్ధులు వృద్ధియైనవి. ఆనాఁటి తనతోడి బాలకులలో రాధేయుఁడుచుక్కలలోచంద్రునియట్లు ప్రకాశించుచుండెను.

ఆకాలమునఁ బాండవుల ధనుర్విద్యా గురువు ద్రోణా చార్యుఁడు. అందఱిలో నర్జునుఁడు విలువిద్యయందు మిన్నయై, గురుని యాదరణకుఁ బాత్రుఁడైనాఁడు. కౌరవ పాండవులలో నస్త్రవిద్యయం దర్జునుఁ డారితేరినాఁడు. గదా యుద్ధమున భీమునితో సాటిలేనివాఁ డనిపించుకొన్నాఁడు.

పాండవులు ద్రోణాచార్యులకడ ననుదినము ధనుర్విద్యాభ్యాసము చేయుచుండుట కర్ణుఁడుఁ జూచుచుండెను. కాంచుకొలఁది యాతనిపండ్లు పులియుచుండెను. కాని తన్ను ద్రోణుని శిష్యత్వమున కప్పగించునాథుఁడుగాన రాఁడయ్యెను. ఇట్లుండ నొకనాఁడు కర్ణుఁడు ధైర్యమూని, గురుదేవుఁడేకాంతముగానున్నప్పుడు దాపునకేగి, భక్తిపూర్వకముగా నమస్కరించి, "గురుదేవా! విలువిద్యయం దర్జునునితో సమానుఁడనై యుండఁగోరి మీసన్నిధి కరుదెంచితిని. నాపాలకరుణాశాలుఁడవై మహాస్త్రప్రయోగము లెఱిఁగింపఁ బ్రార్థించుచున్నాను." అనెను ఆమాటలను ద్రోణాచార్యులు పెడచెవినిబెట్టి నిరాకరించెను. గురువుగారు తనయెడఁ గనబఱచిన నిరాదరణకుఁ గర్ణుఁడు నిలువున నీరైనాఁడు. తన యాశాలత వాతాహతిఁ దూలిపడినది. అస్త్రవిద్యయం దాతఁడు తలపోయుచుండిన గాలిమేడలు నేలఁగూలినవి. కొంతకాలము కర్ణుఁడు నిర్విణ్ణుఁడైనాఁడు. తరువాత మనోవీధినేదో వింతమెఱుపు మెఱసినది.

వెంటనే కర్ణుఁడచ్చటనుండి బయలుదేఱినాఁడు. ఆ సమయమున మహేంద్రగిరియందు పరశురాముఁడు తపోవృత్తినుండెను. కర్ణుఁ డా మహామహుని పాలికిఁబోయి, పాదములకడ సాష్టాంగప్రణామము చేసినాఁడు. తపస్సమాధినున్న భార్గవరాముఁడు కర్ణుని గ్రీఁగంటఁ దిలకించెను. క్రీఁజూపులోని తళుకుఁ గృపాలేశము కర్ణునకు గోచరమైనది. అంత కర్ణుఁడు: "మహాత్మా! నేను బ్రాహ్మణుఁడను.

మీకడ ధనుర్విద్య గ్రహింపవచ్చితిని. దయతో నీవిద్యార్థిని స్వీకరింపుఁడు" అని మిన్నకుండెను. పరశురాముఁ డాతని ముఖలక్షణములను గమనించెను. మాటల పొంకము నాలోచించెను. శరీరసౌష్ఠవమును దిలకించెను. తన హృదయమున కాతఁ డన్నివిధముల నొప్పినవాఁడని గ్రహించి, గురువాతనిని శిష్యునిగా నంగీకరించెను.

ఆనాఁడు మొదలు రాధేయుఁడు పరశురామాశ్రమమున విలువిద్య నభ్యసించుచుండెను. గురువు తలలోని నాలుకయైనాఁడు. గురువుగారి యడుగుజాడలను గుర్తించి మెలఁగుచుండెను.

ఇట్లుండ నొకదినమున రాధేయుఁడు దీక్షతోఁ విలువిద్య నభ్యాసము సేయుచుండెను. అప్పు డాతని శరమున కొక బ్రాహ్మణుని హోమధేను వడ్డముగా వచ్చినది. వ్రేటు తాకుడువలన గోవు మృతిఁజెందినది. భూసురుని నయనగోళ మెఱ్ఱబాఱినది. తోడనే విప్రుఁ డాగ్రహ పరవశుఁడై "ఏవాఁడు ముందరయక నాగోవును శరాహతిఁ ద్రెళ్ళజేసెనో, వాని రథచక్రము యుద్ధరంగమున నేలకుఁ గ్రుంకుగాక" యని భీమముగా శపించెను.

శాపమునకుఁ గర్ణుఁడు కలఁతఁజెందినాఁడు, కాని యేమియుఁ జేయఁజాలకపోయెను. శాపము బాణప్రయోగమునకన్న తీవ్రవేదనాకరముగదా! ఈ విషయము సర్వమును భార్గవరాముఁడు యోగదృష్టి నెఱిఁగినాఁడు. తెలియక చేసిన యపరాధమునకు గుఱియైన శిష్యుని గనికరించినాఁడు.

ఆతని హృదయవేదన మపనయింప వెంటనే, గురుదేవుఁడు బ్రహ్మాస్త్రములు ప్రసాదించినాఁడు. అప్పటినుండియు గురువు నెడ శిష్యునకత్యంత భక్తివిశ్వాసములు, గురువునకు శిష్యుని పట్ల వాత్సల్యము లతిశయింపఁ జొచ్చినవి. ఇరువురెట కేఁగినను నొండొరులు కలిసిపోవుచుండెడివారు.

ఒకానొక దినమున ప్రాతఃకాలమున గురుశిష్యులు సమిత్కుశఫల గ్రహణార్థ మడవికేగిరి. అందందుతిరిగి పరశురాముఁడు శిష్యునితొడపై శిరము జేర్చి యలసటఁ దీర్చుకొని నిద్రించెను. అది మహారణ్య మధ్యము. కీటక సరీసృపములు మెండుగనుండుటచే నప్పుడొక వజ్రకీటకము మెల్లగాఁ వచ్చి కర్ణుని యంకతలమును దొలుచుచుండెను. ఆతనికి బాధ విపరీతముగా గలుఁగుచున్నను, కదలినచో గురుదేవునకు నిద్రాభంగ మగునేమో యని శంకించి, బాధ నోర్చికొనెను. కొంతసేపటికి రక్తము కాలువలుగా బ్రవహింపఁజొచ్చినది. కవోష్ణమైన రుధిరప్రవాహమునకు దేశికుఁడు మేల్కాంచి "కర్ణా! ఏమిది" యని ప్రశ్నించెను. అందులకు మొలక నవ్వు మోమున నటియింప రాధేయుఁడు "మహాత్మా! వజ్రకీటక మొకటి నా తొడఁ దొలిచినది. రక్తముస్రవించినది. లేచినచో మీకు నిద్రాభంగ మగునని, బాధనోర్చుకొన్నాఁడను" అని దీనముగా బలికినాఁడు. దేశికోత్తముఁడు కర్ణుని ధైర్యమును, స్వార్థత్యాగమును మెచ్చుకొన్నాఁడు. కాని, యాతని సహనమునకు శంకించి "కర్ణా! బ్రాహ్మణమాత్రున కింతటి తాల్మియుండదు. నిశ్చయముగా నీ వే కులమువాఁడవో

యెఱిగింపు'' మని యాజ్ఞాపించెను. అందులకు భయకంపితుఁడై రాధేయుఁడు తాను సూతపుత్రుఁడని యెఱిఁగించెను. ఆ మాటలకు భార్గవరాముఁడు కుపితుఁడై ''బ్రాహ్మణబాలుఁడ నని నన్ను వంచించి, యస్త్రవిద్య సమగ్రముగా గ్రహించితివి. యుద్ధకాలమున నీయస్త్ర విద్యా వైభవము నిర్వీర్య మగు గాక'' యనిశపించెను. తోడనే పరశురాముఁ డాశ్రమాభిముఖుఁడై వెడలిపోయెను. కర్ణుఁడు చేయునది లేక హస్తినాపురము దెస మఱలెను.

కర్ణుఁడు తలచిన దొకటి. తనకైనది మఱొకటి. విధి బలీయమగుచో మంచి చెడుగు, చెడుగు మంచి యగును. ఎంతవానికిగాని కాలము తప్పివచ్చినపు డాతని కన్నియుఁ గష్టములే ప్రాప్తించును. కాని యిదియాతని భావిఫలప్రాప్తి కాధారము లగుట నిస్సంశయము కదా!

ఎన్ని యంతరాయములు కలిగిన, మఱెన్ని శాపములకు నలిగినను రాధేయుఁ డసమాన ధనుర్విద్యా కోవిదుఁడై నాఁడు. తనవిద్యా వైదుష్యమును రాజరాజునకుఁ జూపనువ్విళ్లూరుచుండెను. ఎట్లయినను దుర్యోధనుని కొలువు బ్రవేశింప నుద్యుక్తుఁడై నాఁడు.

ఇట్లుండ నొకనాఁడు ద్రోణుఁడు కౌరవ పాండవుల యస్త్ర విద్యా ప్రదర్శన మేర్పాటుచేసెను. హస్తినాపుర మంతయు నలంకరింపఁబడినది. రాజవీథులలోఁ జలువ పందిళ్లు వేయఁబడినవి. మామిడాకు తోరణాలు కట్టఁబడినవి. మంగళ వాద్యఘోష మిన్ను ముట్టినది. పరిసర గ్రామాదులనుండి

జనులు వేడుక జూచుటకై తండోపతండములుగా వచ్చిరి. రాజకుమారులు యథా లాంఛనలతో వచ్చి యుండిరి. ఆనాఁడు హస్తినాపురముఁ జూడ వేయి కన్నులు చాలక యుండెను.

ప్రదర్శన స్థలమొక విశాల ప్రదేశమున నేర్పఱుపఁ బడినది. రాజన్యు లుచితాసనములం దాసీనులై యుండిరి. ప్రేక్షకులు - స్త్రీ పురుషాదులు-నిర్ణీత స్థలములందుండిరి. ఆ ప్రదేశ మిసుక చల్లిన రాలకుండునంత జనసమ్మర్దముగా నుండెను.

ప్రదర్శనఁ జూపు రాకుమారులు ప్రథమమున గురుదేవుని పాదాల కెఱఁగి, వారి దీవన లందుకొనిరి. మొదట భీమ దుర్యోధనులు సింహము లట్లు రంగస్థలముఁ బ్రవేశించిరి. వారొండొరులు గదాయుద్ధ కౌశలమును జూపిరి. ప్రేక్షకులు భయ భీభత్స నిమగ్నులైరి. అంత నర్జునుఁడు కార్ముకవిద్యా ప్రదర్శనము గావించెను. శరసంధాన లాఘవ లక్ష్య శుద్ధులఁ జూపెను. శిష్యుల విద్యావైభవమును బ్రత్యక్షముగా జూచుచు, ద్రోణుఁడు పులకిత శరీరుఁడయ్యెను. శిష్యుఁడెన్నఁదగిన విద్యావంతుఁడై నుతి పాత్రుఁడగుట కంటె గురువునకుఁ గావలయునది మఱొక్కటియుండునా? తనకృషి ఫలించినదని, తనకన్నులు పండినవని గురువు సంతోషించును గదా!

ఆ సమయమునఁ గార్ముకధారియై కర్ణుఁడు వేవేగమున రంగస్థలమున కేతెంచుచుండెను. ప్రేక్షకులు మూగియుండు

టచే వారి నొత్తిగిల్లుఁడని పలుకుచుఁ బ్రవేశించెను. ఇది నైజము. ఒకచో నొక విద్యాప్రదర్శనము జరుగుచుండఁగా తద్విద్యాపరుఁడా స్థలమున కేతెంచక మానఁడు. రాధేయుని దేహకాంతులు నలుగడల వ్యాపించెను, ఆతనియందు ధనుర్విద్య మూర్తీభవించియుండెను. వచ్చువాఁడు రెండవ సూర్యుఁడాయని చూపఱకు భ్రమ కలిగినది. అప్పవాల్పక కర్ణుని యాకారము, వాలకమును జూచుచుండిరి.

అంతటఁ గర్ణుఁడువచ్చి, బాణ విద్యా వైదుష్యమును జూపుచున్న యర్జునుని దేరి పాఱఁజూచి "నిలు, అర్జునా? నీవే ప్రజ్ఞావంతుఁడ వనుకొంటివా? నేనును గొంత శరవిద్య నేర్చిన వాఁడనే. నీతో విలువిద్యయందు సరితూఁగువాఁ డిచ్చట లేకపోవుటచే నే నే గొప్పవాఁడనని విఱ్ఱవీఁగుచున్నావు." అని గంభీరముగా బలికి, ద్రోణాచార్య పాదకమలములకు నమస్కరించి, ధనుర్విద్యాకౌశలము జూపననుజ్ఞ వేడెను.

అందులకు గురుదేవుఁ డంగీకరించినాఁడు. రాధేయుఁడు తనయందుఁ గల శరలాఘవమును జూపెను. ప్రేక్షకులు సంతోష విస్మయ నిమగ్నులైరి. ఒండొరులు గుసగుసలాడిరి. దుర్యోధనుఁడు పట్టరాని సంతోషమున మిన్నుముట్టెను. అర్జునాదులు ప్రమాన్పడి చూచిరి. ద్రోణాచార్యుఁడు విస్మితుఁ డైనాఁడు.

అప్పుడు దుర్యోధనుఁడు రాధేయుని బిగియారఁ గౌఁగలించి "ఇది మొదలు నాకు మిత్రుఁడవై రాజ్య భోగ

ముల ననుభవింపుము." అని మనసారఁబలికెను. అట్టియెడఁ కృపాచార్యుఁ డాసనమునుండి దిగ్గున లేచి, కర్ణునిదిక్కు జూచి "అర్జునుఁడు సుక్షత్రియకుల సంభవుఁడు. నీ కుల గోత్రములు తెలియవు. తగినవాఁడవైనచో యర్జునుఁడు నీతో యుద్ధము సేయ సిద్ధపడు" నని పలికెను. ఆ మాట లాలింపఁగనే రాధేయుని వదన కమలము వాడుబాఱినది. తాను సూతకుమారుఁడ నని తెలుపుటకు వెను కాడినాఁడు. తనయందున్న ధనుర్విద్యా చంద్రబింబము కులగోత్ర మేఘ మాలికల మఱుఁగు పడినది కాఁగా, కర్ణుఁడు సూత సూనుడని గ్రహించి భీమాదు లాతనిని గేలి యొనరించిరి.

సాటిలేని మేటి విలుకానికి వాటిల్లిన యవహేళనకు, భీమాదు లొనరించు హాస్యవాక్యములకు దుర్యోధనుఁ డాగ్రహించి, రంగస్థలము నలుగడలఁ గలయఁజూచి "సభ్యులారా ! వావి వరుసలు, కులగోత్రములు తెలియ వలసిన స్థలముగాదు. ఇందు శౌర్యము, విద్యా ప్రదర్శనమే ముఖ్యము. ఇది వివాహమంటపమా ! కాదు, రంగస్థలము కర్ణుఁడెవ్వఁడైన నేమి ? ఇచ్చట విద్యాప్రశస్తియే గాని కులగోత్రముల యెన్నిక గాదు. శౌర్య పరాక్రమములు, విలువిద్య యాతని సొమ్మయినది. విద్యాధనములకు, కులగోత్రములకు సంబంధమేలేదని మీఁ బోట్లకుఁ దెలియని యంశముగాదు. ఈతఁడు రాజు గాఁడని మీరు సంశయించుచున్నారు. ఇదిగో ! ఈతనిని రాజుగా జేయుచున్నాను" అని గంభీరముగా బలికెను.

వెంటనే దుర్యోధనుఁడు సకల రాజ సమక్షమునఁ గర్ణున కంగరాజ్యము నొసంగి రాజుగా నొనర్చెను. అంద ఱాశ్చర్య సంభరితులైరి. అప్పుడు రాధేయుఁడు దుర్యోధనుని సమయస్ఫూర్తికిఁ, దనపై గల యాదరాభిమానముల కలరి "కురునాథా! నీవు గావించిన యీ కార్య మపూర్వము. నాపై నీకుఁగల యభిమాన మసాధారణము. సామాన్యుఁడ నగు నాకు సమస్త రాజసమక్షమం దంగరాజ్యమున కధినేఁతనుగా నొనరించిన నీ ఋణ మెట్లు తీర్చుకొందునో కదా!" యని కౌరవేశ్వరుని బిగియార గౌఁగలించుకొనెను.

అందులకు దుర్యోధనుఁడు సంతోషమున "కర్ణా! నీవు నాకు హితుఁడవుగా నుండుటయే చాలు"నని పలికెను. ఇంతటితో నాఁటి ప్రదర్శనము ముగిసెను. నాఁటఁగోలె కర్ణ దుర్యోధనులు ప్రాణ మిత్రులుగా నుండిరి.

అంగరాజ్యాధిపతియై దుర్యోధనునకుఁ జేదోడు వాదోడుగానుండి, కర్ణుఁడెంత రణవీరుఁడో యంత దాన వీరుఁడని ఖ్యాతిగాంచెను. దాతృత్వమున గర్ణుఁడు ధర్మ రాజుకంటె వీనుమిగిలిన వాఁడని శ్రీకృష్ణునకుఁ దెలియును. కాని యుధిష్ఠిరుఁడు తాను మహాదాతనను గర్వమునఁ బొంగిపోయెడివాఁడు. ఇట్లుండ, ధర్మజుని గర్వాపహారణము సేయందలంచి, కృష్ణుఁడొకనాఁ డిష్టాగోష్ఠిలో "బావా! నీవు మహాదాతవు. సందియము లేదు. నీకు మేరుపర్వతము స్వాధీనమైనయెడల నద్దాని నెంతకాలములో దానము సేయు వాఁడ" వనెను. అందులకు ధర్మజుఁడు "కృష్ణా! మేరు

పర్వతపరిమాణము దెలిసికొనుటకుఁ గొన్నియేండ్లు పట్టు"
నని జవాబిచ్చెను. ఆసమయమునందే కర్ణుఁడా స్థలమున
కేతెంచెను. కృష్ణుఁ డదేప్రశ్న కర్ణుననడిగెను. అందుల
కాతఁడు చిఱునవ్వుతో "ఈభాగ్యమునకు కాలవ్యవధి వల
యునా? దాపున బ్రాహ్మణుఁడుండిన నొక్కక్షణమునందే
దానము సేయువాఁడ" ననెను.

ఈ మాటలకు ధర్మజుని వదనము వాఁడుబారుటయు,
కృష్ణునిమోము వికసించుటయు నొక కాలమందే జరిగినది.

వీరులు వీరత్వసూచకముగా వీరకంకణము నెడమ
చేతికిని, దాతలు దాతృత్వ సూచకముగా దానకంకణమును
కుడిచేతికిని దాల్చుట లోకాచారము. కనుక, దుర్యో
ధనుఁడు వీరకంకణమును దాల్చెను. కర్ణుఁడు దానవీర
కంకణములు ధరించెను.

కర్ణుఁడు కంకణద్వయము దాల్చియుండుట, దుర్యో
ధనుఁడు గమనించి, తానుగూడ దానకంకణము కుడిచేతికి
దాల్చెను. నాఁటినుండియుఁ దదనురూపముగా నర్థులకు
లేదనక దుర్యోధనుఁ డొసఁగుచుండెను.

ఇట్లుండఁ గొంతకాలమైన తరువాత సురరాజునకుఁ
గన్నుఁగుట్టి, దుర్యోధనుఁడు దానకంకణముదాల్ప నర్హుఁడు
కాఁడని నిరూపింపఁ దలపోసెను. ఒకనాఁ డింద్రుఁడు
బ్రాహ్మణవేషమున దుర్యోధనుని దగ్గఱకేతెంచి "ప్రభూ!
నేనొక యజ్ఞముసేయ తలపెట్టితిని. వస్తుసంభారములన్నియు

సమకూర్చుకొంటిని. ఇంతలో వర్షాకాలము దాపరించినది. కాని, యెండిన వంటచెఱకు లభింపలేదు. మీరు మహా దాతలు, నాకు వంటచెఱకు లభింపఁజేసి, నాయాగము నిర్విఘ్నముగా గొనసాగునట్లు పుణ్యము గట్టుకొనుఁడ''ని దీనముగా బ్రార్థించెను.

సుయోధనున కీయర్థి యభీష్టము లేశమాత్రమైనదే యని యూహించి ''వలయునంత వంటచెఱకుఁ గొని పొమ్మ''ని యానతిచ్చెను. అందులకా కుహనాబ్రాహ్మ ణుఁడు మిన్నందినట్లు సంతోషముతో ''రాజా! నేను ఋత్విక్కుల నేర్పాటుచేసికొని, త్వరగావచ్చి యట్లుచేయుదు'' నని పలికి వెడలిపోయెను.

ఆ మఱుక్షణమందే హస్తినాపురిపైన కాలకారు మేఘము లావరించినవి. తటిత్తులు మెఱసినవి. ఉఱుములు భూమి దద్దరింపఁజేసినవి. కుంభద్రోణముగా వర్షము కురిసి నది. వాగులు వంకలేకములైనవి. తృటిలో పట్టణమం తయు జలార్ణవమైనది. మహారాజులు మొదలు బీదలవఱకుఁ దమ గృహావరణములలోఁ దాఁచుకొన్న వంటచెఱకు తడిసి ముద్దయైనది. నిత్యకృత్యముగా జేయు వంటకు బ్రాయ్యలు రాజక జనులు బాధపడఁజొచ్చిరి. ఇట్లు మూఁడుదినము లెడతెఱిపిలేక వర్షము కురిసినది.

ఆ మఱునాఁటికి వాన వెలిసినది. బ్రాహ్మణుఁడు సుయోధనుని దగ్గఱకేతెంచి వాగ్దానమును జెల్లింపుమని కోరెను. అప్పుడు దుర్యోధనుఁడు దిగ్భ్రమసెంది ''అయ్యా!

వర్ష పాతమువలన జనులు పెక్కు కష్టముల పాలగుచున్నారు. పట్టణవాసులు వంటచేసికొనక నిరాహారస్థితి గాలము గడుపుచున్నారు. ఇపుడెట్లు మీరు కోరినట్లెండిన వంటచెఱకు లభింపఁగలదు? ఇది యసంభవ" మని బ్రాహ్మణుని బొమ్మనెను.

అంతట నామాయా భూసురుఁడు వెంటనే కర్ణుని దగ్గఱ కేగుదెంచి తన విషయమును సర్వము నివేదించెను. రాధేయుఁడాతని యుదంతము గ్రహించి, సేవకులను బిలిపించి తన సౌధమును, బగులఁగొట్టించి, యందలికలపను, బ్రాహ్మణున కిప్పించెను. విప్రుఁడు కట్టెల బండ్లకెత్తించికొని పోవుచు, దుర్యోధనుని దాపునకరిగి "మహారాజా! మీరీయఁజాలని యెండిన వంటచెఱకును కర్ణుఁ డొసఁగినాఁడు. దానకంకణ మాతనికే తగు. మీరు దాతృనర్హులుకారు" అని గంభీరముగా బలికి వెడలిపోయెను.

కర్ణుఁ డొనరించిన దాతృత్వమునకు రాజరాజు విస్మితుఁడయ్యెను. ఆనాఁటితో దన దానకంకణమునకు స్వస్తిచెప్పెను.

కర్ణుఁడు "దానకర్ణుఁడ"ను ఖ్యాతి లోకమున బ్రాఁకినది. పరలోకములకుఁగూడ వ్యాపించినది. ఇఁక యాచకు లేతెంచి కుండలములను, కవచమునుగూడఁ గోరినచో రాధేయుఁడిచ్చివేయుటకు సంసిద్ధుఁడని సూర్యుఁడు గ్రహించినాఁడు. ఇట్టిసమయములోఁ దాను జోక్యము

కలిగించుకొనకపోయిన కర్ణునకు ముప్పు వాటిల్లునని యోచించినాఁడు.

ఒకనాఁడు భాస్కరుఁడు కుమారునిపై గల ప్రేమాతిశయమున విప్రవేషమున కర్ణునికడ కేగుదెంచి "అంగరాజా! నా యనుగ్రహమునఁ గుంతికి నీవు జన్మించితివి. క్షత్రియుడఁవే కాని సూతసూనుఁడవుగావు. ఏదో విధికృతమున ననుసరించి నీవు కౌరవులఁ జేరినాఁడవు. కొలఁది కాలమునకుఁ గౌరవ పాండవులకు ఘోరసంగ్రామము సంభవింపనున్నది. అర్జునుని దెగటార్పఁ గలవని దుర్యోధనుఁడు విశ్వసించియున్నాఁడు. నా యనుగ్రహమున నీకుఁ గలిగిన కవచకుండలము లున్నంతవఱకు నీవ జేయుఁడవు. ఇంద్రుఁడు నిన్నేమరించి, మాయారూపమున గవచకుండలముల నర్థించిన నిరాకరింపుము. దీన నీ దాన విఖ్యాతికో కలోటు వాటిల్లదు. నామాట నమ్ము"మని హృదయము ముట్టఁ బలికెను.

ఆమాట లాలించుతోడనే రాధేయుని హృదయగోళమున సంతోషాశ్చర్యములు రేకెత్తినవి. అతఁడు కరములు మోడ్చి "దేవా! మూర్త్రిత్రయ రూపుఁడవగు నీదర్శన భాగ్యమున ధన్యుఁడనైతిని. నా జన్మము పావనమైనది. నాయెడ బుత్రవాత్సల్యమునఁ జేసి, యరుదెంచి, యింతగా హితోపదేశ మొనరించినందులకు మీకు ధన్యవాదములు. కాని, నా ప్రార్థన మొక్కటి యాలింపవలయు. అర్థులువచ్చి యాచించిన నాసర్వస్వము ధారవోయుటకు దీక్షఁబూనితిని.

ఇంద్రుఁ డంతవాఁడువచ్చి యాచించిన నీయకుండుటెట్లు? అస్థిరమగు దేహమును నమ్ముకొని, శాశ్వతయశస్సునకుఁ గళంక మాపాదించుకొనుట వ్రతభంగమగును. ఈ విషయమున మీ హితవున కడ్డువచ్చితిని. క్షమింపుఁ"డని తన మనో నిశ్చయమును వెలిబుచ్చెను.

సూర్యుఁ డాతని పలుకు లాలింపఁగనే నిర్విణ్ణుఁడై నాఁడు. ఆతని యచంచల దానదీక్షకు విస్మితుఁడై దీవించి, యంతర్ధానుఁ డయ్యెను.

అది పాండవులు లాక్షాగృహదహనా నంతరము, మాఱువేషములతో దిరుగుచుండిన కాలము. అప్పుడు కళింగ దేశాధిపతియగు చిత్రాంగదుఁడు తనకుమార్తెయగు శుభాంగికి స్వయంవరము జాట బనిచెను. ఆ స్వయంవర సమయమునకు శిశుపాలుఁడు, రుక్మి, జరాసంధుఁడు మున్నగు రాజప్రముఖులు వచ్చిరి. ఆనాఁటికి దుర్యోధనుఁడును గర్ణునితో గళింగరాజధాని కరుదెంచెను. కల్యాణవేదిక వైభవముగా నుండెను. అప్పుడు శుభాంగి స్వర్ణాభరణ భూషితయై, చెలికత్తె రాజకుమారుల చరిత్రలు దెలుపుచుండఁగా, దుర్యోధనుని వరింపక దాటిపోయెను. అంత సుయోధనుఁడు సాహసించి శుభాంగినిని బట్టుకొని హస్తినాపురాభిముఖుఁడయ్యెను. స్వయంవరమున కేతెంచిన శిశుపాలాదులు దుర్యోధనునిపైఁ గాలుద్రవ్విరి. కాని కర్ణుఁడు పరాక్రమముతో దుర్యోధనున కండఁగానిలిచి మార్గము సురక్షితము జేసెను. శిశుపాలాదులు చేయునది లేక వెడలి

పోయిరి. జరాసంధుఁడు మాత్రము కర్ణుని వీరావేశముగాంచి పోరి కాహ్వానించెను.

కర్ణుఁ డందుల కంగీకరించి, జరాసంధునితో ద్వంద్వ యుద్ధము గావించినాఁడు. అందు జరాసంధుని యంగసంధి వికలమగుటచే, నాతనితో సంధిచేసికొని, పరిహారముగా మాలినీ నగరమును కర్ణునకిచ్చి మెచ్చుకొన్నాఁడు.

రాధేయుఁడు దానమునందేగాక పరాక్రమమునం దసమాన విక్రముఁడను కీర్తి దేశాంతరములందు వ్యాపించి నది. ఇంతటి విక్రమోపేతుఁడగు కర్ణుఁడు తనకు సహాయ ముగా నుండుటచే దుర్యోధనుని సమరోత్సాహ మినుమడించినది.

అది పాండవదూతయై శ్రీకృష్ణుఁడు కౌరవసభకు వచ్చిన సమయము. కృష్ణుఁడు పాండవపక్ష మవలంబించి, కురుసభలో దుర్యోధనాదులకు బోధించినహితవు విఫలమైనది. అప్పుడు కర్ణుని పరాక్రమాది గుణములు శ్రీకృష్ణుఁడు స్వయముగా నెఱింగిన వాఁడగుటచే నెట్లయిన, కర్ణుని పాండవపక్షమునకు ద్రిప్ప నెంచినాఁడు. ఆ యుద్దేశముతో శ్రీకృష్ణుఁడు కురు సభనుండి పోవునపుఁ డేకాంతముగా నాతనితో మాటలాడ సంకల్పించుకొనెను.

కర్ణ కృష్ణు లిరువురు రహస్యస్థలము జేరిరి. అప్పుడు కృష్ణుఁడు మందస్మితుఁడై "కర్ణా! నీ జనన వృత్తాంతమును గూర్చి యొకింత నీ కెఱుక చేయుట నా తలంపు. సూర్యుని వలన గుంతికి జన్మించినవాఁడవు. సూతదంపతులగు చిత్రరథ

రాధలు నిన్ను బెంచినారు. ఈ విషయము నీకుఁ దెలియక పోవుటచే నీవు రాజరాజును గొలుచుచున్నావు. ఇప్పుడైనను మించిపోయినది లేదు. పాండవపక్ష మవలంబింపుము. సకల ధరాచక్రము నీకు స్వాగత మిచ్చుచున్నది. ధర్మజుఁడు నలుగురు తమ్ములతో నిన్ననుసరించి, కొలుచువాఁడు. ద్రౌపదియు నిన్నా అవ భర్తగా వరింపఁ గలదు. సదవకాశ మును బోనాఁడకుము. నీ శ్రేయముగోరి యింతఁగా వచించితి" నని పలికెను.

శ్రీకృష్ణుని యుపన్యాసమును సాకల్యముగా నాలించిన రాధేయున కొకవైపు విస్మయము మఱొకవైపు నవ్వు కలిగినవి. అప్పుడు కర్ణుఁడు సానునయముగా "ముకుందా! నీకు నా యెడఁగలిగిన ప్రేమకు నమోవాకములు. నీవు సకల ధర్మవేత్తవు. నా జన్మ రహస్యమునుగూర్చి యింతకుముందే సూర్యభగవానుఁడు విస్తరించినాఁడు కాని యా విషయము నింతవఱకు రహస్యముగా నుంచితిని. నా వలన నెద్దియో ఘనకార్యము చేయింప భగవంతుఁ డిట్లు నన్ను జన్మింపఁ జేసినాఁడు. ఆ ఘనకార్యమును జేయసంకల్పించితిని. శరీరము, రాజ్యభోగము లస్థిరములు. కీర్తి యొక్కటియే యాచంద్ర తారార్కము. లోకమింతవఱకు నన్ను రాధేయుఁడనియే గుర్తించినది. అటులనే కానిమ్ము. మొదట సామాన్యుఁడనై యున్నపుడు, దుర్యోధనుఁడు నన్ను జేరఁదీసి, యంగరాజ్యమున కభిషేకించినాఁడు. నేఁటివఱకు నే నాతని యుప్పుతినుచున్నాఁడను. నా శౌర్య పరాక్రమము లతని కంకితము చేసి

తిని. నన్ను నమ్మి యాతఁడు రణోత్సాహియై యున్నాఁడు. అట్టిచో నాతనిని బొంకించుటయు, వీడుటయు ధర్మవిరుద్ధము కదా ! తుచ్ఛ సుఖముల కాసఁజెంది విశ్వాసఘాత మొన రించుట కన్న పాపము వేఱుకలదా ! ఒకవేళ నీ మాట మేరకు బాండవులఁజేరితినేని, యర్జునునకు భీతిల్లి యిట్లొన రించితినని లోకులు నన్ను దుయ్యబట్టుదురు. ఇటు లోక నింద, యటు పరలోకచ్యుతిఁ జేఁజేత నెత్తిపై నెక్కించు కొనుట తగునా ? దేహపాత మేపక్షమవలంబించి యున్నను జరిగియే తీరును. ఇట్టి యధర్మకార్య మొనరింపఁజాలను. ఆజన్మాంతము దుర్యోధనునకు బాసటగా నుండెదను. తుదకు జీవములనైన నాతనికి ధారవోయ సంసిద్ధుఁడను, భగవానుఁ డవు నీవు పాండవపక్షమందున్న వారికే హానియు రాఁజాలదు. కాని, ధర్మ మెచ్చటనుండునో జయమచ్చటనే యుండును. నీహితువును త్రోసిపుచ్చుచున్నాఁడనని నాపై కినియకుము. క్షమింపు ''మని పలికెను.

ఆమాట లాలించిన కృష్ణుఁడు ప్రమోదపడినాఁడు. కొంతవడికి హర్ష పులకిత గాత్రుఁడై '' కర్ణా! మెచ్చితి. నీ యసమాన త్యాగము, కార్యదీక్ష, రాజభక్తి, దృఢసంక ల్పము వర్ణనాతీతము. భగవానుడనైన నా హితమును బాటింపక, రాజ్యభోగముల తృణప్రాయములుగా నెంచి కౌరవేశ్వరునికొఱకై తుదకు ప్రాణములనైన ధారవోయు నంతటి సాహసివి. నీ పవిత్రచరిత్ర సకలమానవులకు స్మర ణీయ మగుగాక ! పోయివచ్చెద ''నని వెడలిపోయెను.

కౌరవ పాండవయుద్ధము ఘోరముగా జరుగు చుండెను. ఇరువైపుల వీరులు హతమైరి. రణరంగము పీనుఁగు రాసులతో నిండినది. భూతగణము బువ్వాపుబంతి సాగించుచుండెను. పేరుమ్రోఁగిన యోధులు కూలిరి. రథులు, మహారథులు నామమాత్రావశిష్టులైరి.

కర్ణుఁడు రణరంగము ప్రవేశింప నుద్యుక్తుఁడైనాఁడు. ఆతని రథచోదకుఁడు శల్యుఁడు. యుద్ధాభిముఖుఁడయ్యేనే కాని, కర్ణునిహృదయము కలవరపడుచుండెను. రాధేయుఁడు యథారూపమున నున్నంతవఱకు తమకు జయము లభింపదని భీతిల్లినది పాండవబలము. దుర్యోధనుని జయమాతనిపై యాధారపడియున్నది. తన కుమారున కెట్లయిన జయము కట్టఁబెట్ట వలయునని నిశ్చయించినాఁడు మహేంద్రుఁడు. బావమఱది— చెలికాఁడు— బహిఃప్రాణము— మీఁదు మిక్కిలి భక్తుఁడు—అగు విజయునకు విజయము సాధింప సమకట్టినాఁడు కృష్ణుఁడు. ఇఁక దైవబలమంతయు నొకదెస, కేవల మానవబలము మఱొకదిక్కు, అయిన ప్రాణ మున్నంతవఱకుఁ బోరాడి, తుదకు జయమో! వీరస్వర్గమో చూఱలాడ సంకల్పించిన యోధాగ్రేసరుఁడు కర్ణుఁడు.

అట్టి సమయమున మహేంద్రుఁడు బ్రాహ్మణ వేష ధారియై కర్ణున కెదురువచ్చినాఁడు. ఒంటిబ్రాహ్మణుఁ డెదురు పడినను దుశ్శకునమని కర్ణుఁడు తలంపలేదు. యుద్ధరంగమున కేగు నపుఁ డెదురువచ్చి భూసురుఁడు దీవించునని మాత్రము రాధేయుఁడు తలంచినాఁడు. కుహనావిప్రుఁడు తాను దాన

మభిలషించి వచ్చితినని తెలిపినాఁడు. అందులకు సంతసించి, కర్ణుఁ డాతనికి గో సహస్రమును, వేయిగుఱ్ఱములు, వేయి యేనుంగులు, మోసినంత బంగారము నీయ సంకల్పించినాఁడు. కాని, యవి యెవ్వియు నభీష్టములు కావని బ్రాహ్మణోత్తముఁడు పలికెను.

తుదకు యాగఫలము నిచ్చెదనని కర్ణుఁడు పలికినను గ్రహింప నిష్టపడలేదు. గృహీత తనకు నభీష్ట మేదియో తెలుపఁగోరెను. అందులకు భూసురుఁడు నవ్వి "కర్ణా! నీ వీయఁదలఁచిన దానములు, దానములా! మనసారనొసంగఁ దలఁచితివేని, నీ కవచకుండలము లొసంగుము" అని సాభిప్రాయముగా బలికెను.

అప్పుడు శల్యుఁ డడ్డువచ్చెను. కాని, యెముక లేని చేతి కాతఁ డొక యాటంక మగునా? వెంటనే కర్ణుఁడు సంతోషముగాఁ గవచకుండలములు దీసి, బ్రాహ్మణప్రీతిగా దాన మొసంగెను.

కర్ణుని దాన మహిమకు, సాహస విక్రమములకు దేవతలు హర్షించి, పుష్పవర్షము కురియించిరి. ఆకాశము నుండి హాహాకారము లుప్పతిల్లినవి. ఆతని శరీరము నుండి నెత్తురు కాలువలై ప్రవహించుచుండెను. తాను గావించిన యకార్యమున కింద్రుఁడు సిగ్గున తలవంచినాఁడు. కాని ఱాతి బొమ్మవలె నాతనియెదుట నిలువఁబడి యుండెను. తన దానమున కాతఁడు తృప్తి బొందలేదేమో యని కర్ణుఁడు సురేంద్రుని సంభావించినాఁడు. అంత నింద్రునిమనసు నీరుకాఁగా,

దన నిజస్వరూపమును జూపి, స్వలాభము కొఱకుఁ దాను గావించిన మహోపకారమునకుఁ జింతిల్లినాఁడు. కర్ణున కిసుమంతయైన విచారము కలుగలేదు. ఇంద్రుఁ డంతవాఁడు వచ్చి యర్థించి, దానము గ్రహించినందుల కమితానందము గన్నాఁడు దాత.

సురరాజు మెత్తఁబడి, కర్ణునికి ప్రతిఫలముగా నేదేని వలసిన యర్థింపుమని యాతనిని గోరెను. అందులకు గర్ణుఁడు చిఱునవ్వుతో "మహేంద్రా! నేను దాతనుగాని గ్రహీతను గాను." అని సదుత్తర మిచ్చెను. ఐనను గర్ణుని యౌదార్య మునకుఁ బ్రతిఫలముగా మెచ్చి శక్తియను నాయుధ మొసంగి "రాధేయా! ప్రాణాపాయసమయమున నీ శత్రువు నొక్కని వధింపఁగల సామర్థ్య మీ యాయుధమందుగలదు. పరిగ్ర హింపు" మని వేడెను. అయాచితముగా నింద్రుఁడొసంగినది కాదనలేక కర్ణుఁడు గ్రహించెను.

కొండొక సమయమునఁ గర్ణుఁడు పాండవులను తప్పక వధింపఁగల, డను చింతతో నేకాంతముగాఁగుంతి, కుమారుని జేరి, యాతని జననప్రకారమును విశదీకరించినది. అప్పుడు చేయునది లేక కర్ణుఁడు తాను రాజరాజునకుఁ జేసిన వాగ్దాన మునకు భిన్నముగా జరించిన లోకాపవాద మటుండనిచ్చి, స్వామిద్రోహము జేసిన వాఁడగుట నిశ్చయమని చెప్పెను. ఐనను తల్లి నోదార్చనెంచి కర్ణుఁడు "అమ్మా! పాండవులలో నర్జునునిదప్ప మఱెవ్వరిని జంపను. కావున గర్ణార్జునులలో,

నెవరో యొకఁడు జీవింపఁగలఁడు'' అని చెప్పి యామెను వీడ్కొలిపెను.

కురుపాండవయుద్ధము ప్రారంభ మైనప్పటి నుండియు భీష్ముఁడు సర్వ సేనాధిపతియై పది దినములు ఘోరముగా యుద్ధము గావించెను. వృద్ధుఁడు సేనాధిపతిగా నున్నంత కాలము యుద్ధమున బాల్గొన నని ప్రతినిబట్టినాఁడు కర్ణుఁడు. కాని, భీష్ముఁడు మరణశయ్యపై నున్నపుడు కర్ణుఁ డా మహా మహుని కడ కేగి క్షమాపణ వేడి యుద్ధరంగముజొచ్చెను.

అంత ద్రోణుఁడు సర్వ సేనాధిపత్యము వహించి, యుద్ధముచేసి హతుఁడైనాఁడు. తరువాతఁ గర్ణుని వంతు వచ్చినది. అతఁడు సేనాధిపత్యమును వహించి, శల్యసారథ్య మునఁ బోరి కుపక్రమించెను.

అన్ని విధముల దురదృష్టవంతుఁడైన కర్ణుఁడు తన సామర్థ్యమును యుద్ధరంగమున బ్రకటింపఁజాలక పోయెను. శ్రీకృష్ణుని ప్రేరణవలన భీమతనూజుఁడు కర్ణు నెదుర్కొనెను. ఇంద్రదత్తమైన శక్తి యాతనిపై బ్రయోగించెను. అది వ్యర్థముఁగా విచారించుచున్న రాజ రాజునవలోకించి కర్ణుఁడు ''రాజా ! నా విషయమై సంశయింపవలదు. మేన ప్రాణము లున్నంతవఱకు నీకై పోరాడెదను. నీ ఋణముదీర్చికొందును. పార్థుని కడనున్న యక్షయ తూణీరములకు. నవరథ్యములకు విచారింపనుగాని, కృష్ణ సారథ్యమునుగూర్చి విచారము కలుగుచున్నది. ఐనను నీవు చింతింప వలద''ని పలికెను.

కర్ణుఁడు రణరంగమున బ్రవేశించినేగాని, తన మనసు కలఁతనొందుచుండెను. విప్రశాపము, పరశురామునిశాపము తన హృదయాకాశమునందు మెఱుపువలె తళుక్కు మను చుండెను. అందును శల్యసారథ్యము కర్ణునకు నిరుత్సాహము కలిగింపఁ జొచ్చెను.

మొదట దినమున నర్జునుఁడు రణరంగము బ్రవేశించి, కర్ణుని ప్రతిభా విశేషములు చూడఁజాలక రథము మఱలించు కొని శిబిరము బ్రవేశించెను. రెండవనాఁడు కర్ణార్జునులు ఘోర రణమునకుఁ దలపడిరి. వారిరువురి సమర విక్రమము జూచి, వీరాధివీరు లాశ్చర్య నిమగ్నులైరి. వారి బాణముల నుండి బయల్వెడలిన యగ్నిజ్వాలలు భూమ్యాకాశములు నిండెను. చూచువారికి వారిద్దఱు మూర్తీభవించిన విక్రమ దేవత లట్లుండిరి. వారి జయాపజయములు నిర్ణయించు సమర్థు లెవ్వరు లేరైరి.

కర్ణుని కడ సర్పాస్త్ర మొకటి కలదు. దాని నాతఁ డనుదినము పూజించుచుండెను. ఆ యస్త్రము నొక్కపెట్టున కిరీటిపైఁ బ్రయోగించెను. అదియు నిప్పులు గ్రక్కుచు, నర్జునునిపై దూకుచుండ, కృష్ణుఁడు నేర్పుతో రథము కొంచెము క్రిందకుఁ గ్రుంగునట్లు చేసెను. అందుచేనది పార్థుని సర్వస్వము దగ్ధము సేయుటకుమాఱు, కిరీటమును మాత్రమే దహింపఁ గలిగినది. కర్ణుఁడు కురియించు శర వర్షము నర్జునుఁడు ఖండించుచునే యుండెను.

ఇట్లుండఁగా దైవోపహతుఁడగు రాధేయునకు విప్ర శాపమువలన రథము భూమిలోనికి క్రుంగుటయు, గురు శాపమువలన భార్గవాస్త్రము నిరుపయోగమగుటయు సంభ వించినది. ఐనను రాధేయునకు ధైర్యము సడలలేదు. పట్టుఁ దల సన్నగిల్లలేదు. దీనభావ మానసమున గప్పట్లలేదు. నిరుత్సాహము పొడసూపనులేదు. ఇంతలో రథచక్రము రెండవది గూడ భూమిలోనికి క్రుంగెను. కర్ణుని దునుముట కిదియే సమయమని కృష్ణుఁడు కిరీటికి హెచ్చరిక జేసెను. కర్ణుఁడు రథచక్రము లెత్తఁబోవ, భూమియైన కదలుచుండెను గాని, చక్రములు పైకి లేచుటలేదు. అప్పుడు రాధేయునకు రోష విషాదము లావరించినవి. అంతట నర్జునుని జూచి "అర్జునా! రథమును జక్కచేసికొను నంతవఱకు నీ బాణ ప్రయోగ మాపుము. విరథునిపై శరములు కురియించుట ధర్మ విరుద్ధము. ఇట్టిధర్మము నీకుఁ బ్రొత్తది కాదు." అని సాభిప్రాయముగా బలికెను. అందుల కర్జునుఁడు "ధర్మ పన్నములు పలుకుటకిది కొలువుకూటము కాదుకదా" యని యుపాలంభ మొనరించెను.

శ్రీకృష్ణప్రేరణవలన నర్జునుఁడు విరథుఁడగు కర్ణుని పై నంప వాన గురియించెను. కర్ణుఁడట్లే పోరుసల్పుచుండెను. ఇంతలో నర్జునుఁ డొక దివ్యాస్త్రమును బ్రయోగించెను. అది ప్రళయాగ్నివలె వచ్చి కర్ణునిశిరమును హరించెను. కర్ణుని పతనమువలన రణరంగమున నెల్లురేగిన హాహాకార ములు మిన్ను ముట్టినవి. దుర్యోధనుని జింతా సాగరము

చెలియలికట్ట నతిక్రమించినది. ఆతని రణోత్సాహ మడుగంటినది.

పాండవులకు కర్ణుఁ డగ్రజుఁ డని తెలియదు. కాని, యుద్ధానంతరము రణనిహతులకుఁ దిలోదకము లిడునప్పుడు ధర్మరాజునకుఁ దెలియవచ్చెను. అప్పుడాతని దుఃఖమింత యనుటకు వీలులేక పోయినది.

మహావీరుఁడు, రాజభక్తిపరుఁడు, మహాదాత యగు కర్ణుఁ డంతరించినను కీర్తి నేఁటివఱకు భారతావని నిలిచియున్నది. కర్ణుఁడు "దానకర్ణుఁడు" అనియుఁ, "గర్ణని తోఁడిదభారత" మని ప్రశక్తి నేఁటికిని వినఁబడుచున్నది కదా!

## ౨. దేశాభిమానము

చిత్తూరు భారతమాత కమూల్యాభరణము లగు నగరములలో నొకటి. ఉదయసింహుఁ డా నగరపాలకుఁడు. అతఁడు సూర్యవంశీయుఁడు. సహజభీరువు, భోగలాలసుఁడు. కాని యుదారగుణము, దృఢసంకల్పము—ఆతనిసొమ్ములు.

అక్బరు చక్రవర్తి, ఢిల్లీ సింహాసన మధిష్ఠించిన కొంతకాలమునకుఁ జిత్తూరుకోటను ముట్టడింపఁ బ్రబల సేనతో దండువెడలెను. దుర్గమును గాపాడుటకు, వంశ ప్రతిష్ఠను నిలుపుటకు రసపుత్రయోధులు వీర కంకణములు దాల్చిరి. వా రెంత వీరప్రతాపములు చూపినను ముసల్మానులదే పయిచేయి యయ్యెను. అందుచే నుదయసింహుఁడు కోటనువీడి పలాయన మొనరించెను. అడవిలో నందందు జరియించుచు నెట్లో యారావళీ పర్వతప్రాంతము చేరుకొనెను. అచ్చట ఉదయపురమను పేర నొక పట్టణము గట్టుకొని, బంధు మిత్రాదులతోఁ గాలము గడుపుచుండెను.

చిత్తూరు దుర్గము ముసల్మానుల హస్తగతమైన నాలుగేండ్లకు నుదయసింహుడు గతించెను. తనకుఁ గలిగిన పెక్కండ్రు సుతులలో జ్యేష్ఠుఁడు ప్రతాపసింహుఁడు. తండ్రి తరువాత తానే రాజయ్యెను. అతఁడు రాష్ట్రము, సింహాసనము, ధనాగారము లేని ప్రభువు. కాని, యాతనికి నానాఁట నుత్సాహశక్తి ప్రబల మగుచుండెను. పురాణ-

భారత వీరు లాతని హృదయసీమఁ బద్మాసనము వేసికొని యుండిరి. మొగలాయి ప్రభుత్వమును నేలమట్టము గావింప వలయునని యాతని దృఢసంకల్పము. ఇఁకఁ బ్రతాపసింహుని శత్రువన్ననో, యపారధనము, నపరిమిత సైన్యముగల చక్రవర్తి. రాజనీతి పారంగతుఁడగు నక్బరుపాదుషా, యితర రాజపుత్రు లెవ్వరు ప్రతాపునకు సాయము రాకుండ, వారి వారికి వైషమ్యములు కలిగించి, వేరుపఱచెను. మార్వార్, అంబేర్, బికనీర్, మున్నగు సంస్థానాధీశ్వరు లక్బరుపక్ష మవలంబించిరి. తుదకు బ్రతాపుని తమ్ముఁ డగు సాగరజీ కూడ శత్రుపక్షము జేరెను. కాని, ప్రతాపునకుమాత్రము స్వదేశాభిమానము, వంశగౌరవము, తోడు నీడలుగా నుండినవి.

తమ స్త్రీల పాతివ్రత్యమును, కులగౌరవమును, స్వదేశ జాతి ప్రతిష్ఠలను వమ్ము గావించిన కొందఱు రాజపుత్రులను బ్రతాపుఁడు తిరస్కరించెను. ఇంకను "తురుష్కులకు, దమ కుమార్తెలఁ గట్టఁబెట్టిన రాజపుత్రులతో నితర రసపుత్రులు సంబంధ బాంధవ్యములు నెఱపఁ గూడద"ని నిర్బంధ మొనరించెను. ఈ రెండు కారణముల చేతగూడ మఱికొందఱు రాజపుత్రులు శత్రుపక్షము జేరిరి.

ప్రతాపుఁడు కుటుంబముతో నరణ్యములలో నున్నపుడు, తినుటకుఁ గాయఁ గసురులైనను దొఱకుట కొన్ని వేళల నరుదైనది. సాధారణముగా నడవిలో బండు, కొఱ్ఱలు, రాగులు, మున్నగు క్షుద్ర ధాన్యములతోఁ జేయఁ బడిన

రొట్టెలతోఁ గాలము గడపుచుండెను. ఇఁక తన ముద్దుబిడ్డల స్థితిని జూచినపుడు కలుగు విచారమునకు మేరయే లేదు. హంసతూలికాతల్పమున బరుండవలసిన, బంగారు తూగుటుయ్యేలల నూఁగవలసిన ముద్దుకూనల పరిస్థితిఁ జూచుచు లోలోన కుములుచుండెడివాఁడు. విధిబలీయమైనపు డెంతవారికిగాని యిక్కట్లు తప్పవు గదా! ఒక పర్యాయ మొక పసిబిడ్డ రొట్టె తినుచుండగా నడవిపిల్లి దానిని తటాలున నోటఁగఱచుకొనిపోయెను. ప్రతాపుఁడుచూచుచు మిన్నకుండెను. ఇట్టి కష్టముల నెన్నియో యనుభవించి, కన్నుల నీరు నించెడువాఁడు.

మానసింహుఁడు జయపురాధీశుఁడు. ఇతఁడు రస పుత్రుఁడైనను శత్రుపక్షములోనివాఁడు. ఇతఁడు తన సోదరిని హుమాయూన్‌న కిచ్చెను. మఱొక చెల్లెలి నక్బరున కొసంగెను. ఇట్లగుటచే మానసింహుఁ డక్బరునకు మేనమామయు, బావమఱఁదియు నయ్యెను.

ఒకమారు మానసింహుఁ డొక యుద్ధయాత్రనుండి, ఢిల్లీకి మఱలుచు, కుమళ్‌నేరులోనున్న ప్రతాపుని జుట్టపు మర్యాదతో దర్శింపవచ్చెను. ప్రతాపుఁ డాతనిని గౌరవముగా నాహ్వానించి, యొక కాసారతీరమున విందేర్పాటు గావించెను. కాని తానుమాత్ర మా చెంతకుఁ బోకుండెను. విందు వడ్డన జరుగుచుండెను. ఇష్టులు బంధు మిత్రాదులు వరుసలు దీరి కూర్చున్నారు. మానసింహుఁడు తనతో పంక్తి భోజనమునకు రమ్మని ప్రతాపసింహునకు వర్తమాన మంపినాఁడు.

అందులకు ప్రతాపుఁడు తన దేహము సుస్థిగా నున్నదని ప్రత్యుత్తర మంపెను. అంతలో నాగక మాన సింహుఁడు మఱల "ఆహ్వానించినవారు విందులోఁ బాల్గొన కుండుట భావ్యముగాద"ని కబురంపెను. కాని, ప్రతాపుఁడుగ్రుఁడై "మ్లేచ్ఛులతో సంబంధ బాంధవ్యములు చేసికొన్న వారితో పంక్తి భోజనమున కంగీకరింప న"ని వర్తమాన మంపెను.

ఈ మాటలువిన్న మానసింహున కగ్గిలో నాజ్యము బోసి నట్లయినది. కండ్లెఱ్ఱఁజేసి, చివాలునలేచి "మా యక్క సెల్లెండ్రను మొగలాయి ప్రభువుల కిచ్చినది, మీ వంశ గౌరవమును, నిల్పుటకే యని గ్రహింపలేక. పోయి నాఁడవు. ఈ విషయము గుర్తెఱుంగఁ జాలవు గాన నీరాజ్య మింక నిలుపుకొనలేవు" అని పట్టరాని కోపమున పోఁ బోయెను. ఇంతలో ప్రతాపుఁ డేతెంచి, "ఇది కారణముగా గైకొని, యొకవేళ యుద్ధసన్నద్ధుఁడవై వచ్చుచో, మఱువక నీ వెంట నీ మేనల్లుని గూడఁ దీసికొని రమ్ము" అని యెత్తి పొడిచెను. అందులకు బీరమున మానసింహుఁ డశ్వ మెక్కి "సరే! నీ గర్వము నేలమట్టము గావింపకున్న నా పేరు మానసింహుఁడు కాదని" పయనించెను.

వాయువేగమున మానసింహుఁడు ఢిల్లీ నగరమును జేరి; తనకు సరివానివలన గలిగిన యవమానమును విశద ముగా నక్బరుతో మొఱఁ బెట్టుకొన్నాఁడు. అప్పుడు మొగలాయి కొలువు సంద్రములో తుపాను రేఁగిన ట్లయినది. ఝుంఝూమారుతము వీఁచి న ట్లయినది.

అక్బరు నయశాలి, నిండుకుండ, తనతో ద్వేషించిన రాజపుత్రులను గాలరాయ సంకల్పించినవాఁడు గావున, మానసింగునకుఁ గలిగిన యవమానము తనదిగా భావించినాఁడు. వెంటనే సలీమునాయకత్వమున బ్రబల సైన్యమిచ్చి, ప్రతాపునిపైకిఁ బంపెను. ప్రతాపునకుఁ బ్రత్యక్షముగా బోరుట తప్పని సరి యయ్యెను. తన దండనుక్కుసలాకలఁ బోలు వీరయోధులు రసపుత్రులు రెండువేలమంది, ప్రాణాలనైన వీడఁ జంకని భిల్లులు విల్లు నమ్ములతో బ్రతాపుని సహాయముగా నిల్చిరి. వీరందఱు బారులు తీరిరి. ఆరావళీ పర్వత ప్రాంతము రణరంగమైనది. ఉభయ పక్షముల వారికి పోరు ప్రారంభమైనది.

ప్రతాపుఁడు నిజప్రతాపమును జూప నుద్యుక్తుఁడైనాఁడు. శత్రుసేనల భేదించుకొనుచు మానసింహునితోఁ దలపడ నుత్సాహపూరితుఁ డయ్యెను. ఇరు తెగలవారిలో ననేకులు హతులైరి. రణరంగము రక్తపంకిలమైనది.

సలీము సేనాసమేతుఁడై సర్వశక్తులను బ్రతాపునిపైఁ గేంద్రీకరించెను. తనవైపు సైనికు లెక్కువగా హతులగుట ప్రతాపుఁడుచూచెను. శత్రుసేన యుక్కుమిగిలియుండుటయు గ్రహించెను. అందుచే ప్రతాపునిధైర్యము క్రమక్రమముగా సన్నగిల్లఁ జొచ్చెను. సర్వనాశన మొందుటకంటె, బ్రాణ రక్షణ మా తరుణమున శ్రేయస్కరమని యాతనికిఁదోచినది. వెంటనే ప్రతాపుఁడు తన యుద్ధాశ్వమును మఱలించెను. సలీము మోము విప్పారినది. తురుష్కసైన్యమునుండి

జయభేరి మ్రోఁగినది. జయలక్ష్మీ చిహ్నముతో సలీము ఢిల్లీనగరాభిముఖుఁడయ్యెను. హతశేషులగు సైనికులాతని వెంట బయలుదేరిరి.

పాదుషా నగరులో నొక విలాసమందిరము. అందు రతనాల గద్దియపై గూర్చున్నాఁడక్బరు. వినోదములఁబ్రొద్దు పుచ్చుచున్న యాతనికి విజయవార్త వీనులు సోకఁగనే, యాతని హృదయాకాశమునందు బున్నమ జాబిల్లి పండు వెన్నెల గురిసినది. మానసింహుఁడానందభరితుఁడైనాఁడు. ఒకవేళ ప్రస్తుతము తమకు విజయము లభించినను, ప్రతాపుఁడు మున్ముందు మొగలాయి ప్రభువులను ముప్పు తిప్పలు పెట్టి మూఁడు చేరల నీరు ద్రాగింపక పోఁడనుట యక్బరు మనసునకు సంశయాస్పదముగా నుండెను.

ఇంతలో వర్షాకాల మాసన్నమైనది. కాయమునకుఁ గలిగిన గాయములు మాన్పుకొనుటకు, నూతనముగా సైన్యమును సమకూర్చుకొనుటకుఁ బ్రతాపునకుఁ దగినవ్యవధి లభించినది. ఈ విరామమును బురస్కరించుకొని, ప్రతాపుఁడిఁక గొంతకాలము వ్యవధి యొసంగుమని యక్బరున కొక వర్తమాన మంపెను. తన్నింతవఱకు లక్ష్యము సేయని రాణాయొద్దనుండి యిట్టి వర్తమానము వచ్చెనని సంతోషాతిశయ్యమున బాదుషా మిన్నందినాఁడు. తనకుఁ దానై శరణు జొచ్చెనని యాస్థానమందలి యుద్యోగుల కందఱకుఁ దెలిపెను. కొందఱు నమ్మిరి. మఱికొందఱు నమ్మకుండిరి.

పృధ్వీసింహుఁడు బికనీరు ప్రభువునకు సోదరుఁడు పేరొందిన రాజపుత్రవీరుఁడు అక్బరునకు స్నేహితుఁడు, సరదారుఁడుగా నుండెను. కాని, ప్రతాపునియెడ పూజ్య భావుఁడు. ప్రతాపుఁ డంపిన వర్తమాన మందలి సత్యా సత్యముల నెఱుంగఁ దలఁచి "ప్రభూ ! ప్రతాపుఁడు మీకు శరణుఁ జొచ్చుట కల్ల. అది యెవరో విరోధి పక్షములోని వారు పుట్టించినది. కావున విశ్వాస పాత్రుఁ డగు నాతనిని బంపి, యదార్థము గనుంగొనుట మంచిది" అని, పాదుషా యంగీకారమును గైకొనెను. అంత పృధ్వీ సింహుఁడు సంతోష చిత్తుఁడై :—

శ్రీ. శ్రీ. రాణా ప్రతాపసింహునకు వందనములు. మీరు పాదుషాను శరణుఁజొచ్చిరని వినుట మా కెంతయు దుఃఖాస్పదము. మా యాశలు నిరాశ లైనట్లు భావించితిమి. మాస్త్రీల పాతివ్రత్యమును, మా ప్రాణములను మొగలాయి ప్రభువునకు విక్రయించితిమి. నేఁటివఱకు రాజపుత్ర వంశ గౌరవమును గాపాడితిరి. ముందుగూడ నట్లే కాపాడవలయు నని మా యాశయము. లోకమంతయు మిముఁబోటి వీర శిఖామణి శ్రేయోభివృద్ధినే కాంక్షించుచున్నది.

మీ యంతరాత్మ, మీ ఖడ్గము, మీ యచంచల దీక్ష, మీకు సాయముగా నున్నంతవఱకు మీ కపకీర్తి కలుఁగనేరదని మా విశ్వాసము. మీ యశ స్సంపాదనకు,

మీ పౌరుషమునకు, మన వంశమున కిష్ట దైవత మగు కాళికాదేవి తోడ్పడును గాక !''

ఇట్లు,
మీ విశ్వాసపాత్రుఁడు,
పృథ్వీసింహుఁడు.

అని విక్రమోత్తేజకరములగు వంశములతో నుత్తరము వ్రాసెను. దాని నాతఁడు విశ్వాస పాత్రుఁడగు సేవకునకిచ్చి, చెప్పవలసిన సంగతులు దెలిపి, పంపెను.

రాజసేవకుఁ డనతికాలములోనే యుదయపుర దుర్గమును సమీపించెను. అచ్చటనున్న భిల్లనాయకుల యనుమతి బడసి, ప్రతాపసింహుని దర్శించెను. భక్తి విశ్వాసపూర్వకముగా నాతఁడు రాణాకు వందన మాచరించి, యుత్తర మొసఁగెను. ప్రతాపుఁడు లేఖ నందికొని, యందలి విషయముల నవగతముచేసికొన్నాఁడు. ఇంతవఱకు డీలుపడియున్న ధైర్య మా లేఖా వృత్తాంతముల గ్రహింపఁగనే ప్రజ్వలింప సాగెను. రాజసేవకుఁడు ఢిల్లీకి మఱలెను.

భావి కర్తవ్యమునుగూర్చి ప్రతాపసింహుఁ డాలోచించుచుండెను. ఆ సమయమున ప్రభుభక్తి పరాయణుఁడు, పూర్వ మంత్రియగు భామాశాహి యను నతఁడు రాణా దగ్గఱ కరుదెంచెను. ఆతఁడు రాణానుజూచి, మోఁకరించి ''ప్రభూ ! ఇంతవఱకు మీ ధనమును గన్నులలో వత్తిడు కొని కాపాడితిని. ఇదిగో ! ధనము'' అని ముల్లెను సమ

ర్పించెను. ప్రతాపుఁ డాతనిని గౌరవముగా సంభావించి, యాతని స్వామిభక్తికి కచ్చెరువొందెను.

పృథ్వీసింహుని లేఖా వృత్తాంతము, భామాశాహి, యర్పించిన ధనము, ప్రతాపసింహుని మనో ధైర్యమును ద్విగుణీకృతము గావించినవి.

తన గాఢాంధకార జీవితమున కవి రెండును తేజోవంతములగు తారలట్లు వెలుఁగిచ్చినవి. తోడనే ప్రతాపుఁ డిరువది యైదువేల సైన్యమును సిద్ధపఱచెను. మఱల మొగలాయి ప్రభువుతోఁ బోరాడ యుద్ధ సన్నద్ధుఁడనని ప్రకటించెను.

ఢిల్లీ నగరములోఁ గలవరము కలిగినది. సైనికశిబిరములలో సంచలనము హెచ్చినది. మఱల రెండు తెగలవారి సైన్యములు రణరంగమున సమీకరించినవి. యుద్ధము ప్రారంభమైనది. మొదట నక్బరు సరదారుఁడగు శహాబాజితో బ్రతాపుఁడు పోరెను. కొలఁది కాలములోనే యాతనిని రూపుమాపెను. ఆతఁడు హతుఁడగుట తోడనే ప్రతాపునకు కుమళనేర్ దుర్గము స్వాధీనమయ్యెను.

ఇట్లు క్రమముగా నరివీర దుర్నిరీక్షుఁడై ప్రతాపుఁడు ముప్పదిరెండు కోటలను స్వాధీనపఱచుకొనెను. అప్పటికి చితోడు మొదలైన మూఁడు దుర్గములుతప్ప, దాఁదాపు మేవాడ రాజ్యమంతయు రాణా హస్తగతమైనది. కాని, చితోడుదుర్గము స్వాధీనమైననే తప్ప, తన మనోభీష్టము నెరవేఱదని ప్రతాపుఁడు తలపోయుచుండెను.

ఆ నాఁడు వ్యర్థవాక్యములుపలికి యీ నాఁడు యుద్ధమునకు దగుదు నమ్మా యని వచ్చిన మాన సింహుఁడు ప్రతాపునితోఁ బోరి పరాభూతుఁడయ్యెను. జరిగినది, జరుగుచున్న యుద్ధకాండను జెవులార వినుచున్న పాదుషాకు గుండెలలోఁ దడ కలుఁగఁ జొచ్చెను. చిరకాల మిట్లు ప్రతాపునితో యుద్ధము సేయుట పాదుషాకు విసుఁగుగా దోఁచెను, ఇంతవఱకు శత్రుపక్షములోనున్న రసపుత్ర సరదారు లీ సమయమునఁ బ్రతాపుని యెడ సానుభూతి పరులైరి.

ఇట్లు మొగలాయి ప్రభువుతోఁ సంగరము తలపెట్టి, యిప్పటికి బ్రతాపునిజీవితములో నిఱువదియైదేండ్లు గడచినవి. తన మనోభీష్టమును కొనసాగించుకొనుటకుఁ బూర్వమే ప్రతాపున కవసానదశ ప్రాప్తించినది. అతఁ డంతిమ క్షణము వఱకును ''నా దేశము, నా జనము, నా కులమ''ని స్మరించుచునే యుండెను.

అమరసింహుఁ డాతని పుత్రుఁడు. కుమారుని దన శయ్యపైఁ జేర్చుకొని ''నాయనా! నా కాలము తీరినది. మొన్న మొన్నటివఱకు, మొగలాయి ప్రభువులపైఁ గత్తికట్టి పూర్తిగా మనోరథుఁడఁ గాజాలకపోతిని. భోగలాలసుఁడవై రాజ్యమును చిన్నాభిన్నము సేయకుము. నా పంతము నెగ్గింపుము. బప్పారావ్ వంశమున కెన్నటికిని గళంక మాపాదింపకుము. ఇంతకుమించి వచియింపఁజాలను'' అని కౌఁగలించుకొని, కంటఁ దడిపెట్టెను.

చుట్టును మూఁగియున్న వీరశిఖామణులు "చిత్తోడు గడమును సాధించి, నీ యాత్మకు శాంతిఁగూర్తు"మని ప్రమాణవాక్యములు పలికిరి. ప్రపంచమునకు నిజప్రతాపమును జూపిన భానుఁడు కనుమఱుఁగైనాఁడు. కాఱుచీకట్లు క్రమ్ముఁజొచ్చినవి. ప్రతాపుఁడును మెల్లఁగా గన్నులుమూసి కాలగర్భమున నిద్రించినాఁడు. భారతదేశనిరుపమాన శౌర్యప్రతాపములఁ రాణిల్లిన నక్షత్రములలో నొక్కటి రాలినది.

రాణా ప్రతాపసింహుని యపూర్వ దేశాభిమానము, కార్యదీక్ష వెదఁజల్లు గీతములను రాజపుత్రస్థానమున నేఁటివఱకు నాబాలగోపాలము కీర్తించి. యశ్రువులు రాల్చుచుందురు.

# ౩. ప్రతిజ్ఞాపాలన

పదునైదవ శతాబ్దమున విజయనగర సామ్రాజ్యమును సాళువ నరసింహరాయలు పాలించుచుండెను. అప్పుడు కోట్యము నాగమనాయకుఁడు కార్యకర్తలలో నొక్కఁడుగా వ్యవహరింపఁ బడుచుండెను. ఈతఁడు మహా పరాక్రమశాలి యగుటచేఁ, జక్రవర్తి విశ్వాసమునకుఁ బాత్రుఁడైనాఁడు. కాంచీపుర మీతని జన్మస్థానము. ఇతఁడు బలిజకులస్థుఁడు. ఇతఁడు సేనాధిపతియై సార్వభౌమునకుఁ జేదోడు వాదోడుగా నుండెను.

విజయనగరసామ్రాజ్యము పేరెత్తినఁ గంటగించు చోళపాండ్యరాజులపై నరసరాయలు దండెత్తి నపుడు, సామ్రాజ్యమునకు విజయవైభవములు సేకూర్చిన మేటి నాగమనాయకుఁడే !

నరసింహరాయల మరణానంతరము తుళువ వంశీయులు సామ్రాజ్యమునకై పోరాడ యత్నించునపుడును బెక్కుచందాలఁ దోడ్పడిన దండనాథుఁ డీతఁడే! ఈ కారణములచే శ్రీ కృష్ణదేవరాయ లీతనిని ధనాగారమున కధ్యక్షుఁడుగా నియమించెను.

నాగమనాయకుఁడు చక్రవర్తి మన్ననకుఁ బాత్రుఁడైనను, ప్రజానురాగమును జూఱలాడుచున్నను, హృదయమున బ్రశాంతిలేకుండెను. సంతానము లేనికొఱత, చిర

కాలమునుండి యాతనిని బాధించుచుండెను. సంతానలబ్ధి కాతఁడు సతీసమేతుఁడై నూఱుదేవుళ్లకు మ్రొక్కెను. పెక్కుదానములు చేసెను. వ్రతము లాచరించెను. పుణ్య తీర్థములు సేవించెను. కాని, తన యభీష్టము నెఱవేరలేదు. తుదకు కాశీక్షేత్రమున కేగ సంకల్పించినాఁడు.

తన మనోగత నిశ్చయమును ప్రభువున కెఱుక పఱచెను. రాయలనుమతించెను. తోడనే యుద్యోగ భారమును, తన మిత్రుఁడగు రామభద్రనాయున కప్పగించి, కాశీయాత్రకు బయలుదేఱెను.

భార్యాసమేతముగా నిట్లు బయలుదేఱి, కొన్ని దినములకు సురక్షితముగా గాశిచేరెను. దంపతు లిరువురు గంగాస్నానమాచరించిరి. విశ్వేశ్వరుని యభిషేకించిరి. అన్న పూర్ణను సేవించిరి. కాశీనగరమున త్రిరాత్రములు గడపి, యాత్ర ముగించుకొని, నిజనగరాభిముఖులైరి.

కొంతకాలము జరిగినది. తరువాత నొక శుభ ముహూర్తమున వారికొక కుమారుఁ డుదయించెను. నాగమ నాయకునకుఁ గలిగిన యానందమునకు మేర లేకుండెను. విశ్వేశ్వరుని వరప్రసాదమునఁ బుట్టినాఁడను నమ్మకమునఁ గుమారునకు విశ్వనాథుఁడని నామకరణము జేసెను.

విశ్వనాథుఁడు కాశీవిశ్వేశ్వరుని దయావిశేషమున బెరిగి పెద్దవాఁడయ్యెను. పెరుగుకొలఁది యాతని సుందరాకృతితో, శరీరమనోబలములు వినియ్యమందినవి. కాలక్రమమున విశ్వనాథుఁడు విద్యాబుద్ధులయందుఁ గణ్యత పొందెను.

గజాశ్వారోహణలయందు మేటియయ్యెను. ధనుర్విద్యాకుశలుఁడైనాఁడు. యుద్ధవిద్యయందు సుశిక్షితుఁ డయ్యెను. ఆ నాఁటి విద్యార్థులలో నీతఁడే మిన్నయనిపించుకొనెను.

జనకునకుఁ జేతి కందివచ్చిన కుమారుని జూచుతోడనే వచ్చు సంతోషమునకు మేరయుండదు కదా !

విశ్వనాథున కిరువదేండ్లు నిండకపూర్వమే జనకుఁ డీతనిని రాయల యాస్థానమునకుఁ గొనిపోయెను. చక్రవర్తిని జూచు తోడఁనే విశ్వనాథుఁడు కరములు మోడ్చినాఁడు. రాయ లాతని వాలకమును జూచి, మహాశూరుఁడును, బుద్ధిమంతుఁడును నగునని భావించెను. ఆతనిపై రాయలు ప్రసన్నదృష్టి బరపి, తనకుఁ దమలపాకులు, వక్కలు నందించు స్వకీయసేవకునిగా నియమించెను. ప్రభుచిత్తవృత్తి గమనించి విశ్వనాథుఁ డనుదినము మెలఁగుచుండెను.

కొంతకాలమైనపిదప, రాయలు పూర్వ దిగ్విజయ యాత్రకు బయలుదేఱెను. విశ్వనాథనాయకుఁ డాతని వెంటఁ బోయి. తనకు నియమించిన దుర్ఘట కార్యముల నైన సునాయాసముగా నెఱవేర్చి చక్రవర్తి మెప్పుగాంచెను. ఈ దండయాత్రలో నాతఁడు కనబఱచిన పౌరుష విక్రమములకు మెచ్చి, రాయలు చేసిన రాయచూరు దండయాత్రకు సేనానినిగా నియమించెను. ఈ కారణమున దండ్రిని మించిన పరాక్రమశాలియని, ప్రజలు వేనోళ్ల విశ్వనాథుని గీర్తింప సాగిరి. ఆతనిపై బ్రజల కాదరాభిమానములు హెచ్చినవి.

ప్రాయమునం దట్టి కీర్తికిఁ బాత్రుఁడైనను గర్వాతిశాయి మాత్రము కాకుండెను.

రాయలు, కటకము మొదలు కన్యాకుమారి వఱకు రాజ్యమును విస్తరింపఁ జేసెను. ప్రజానురంజకముగా రాజ్య మేలుచుండెను. తన కొలువులో నెనమండ్రుగురు కవిరాజులఁ బోషించెను. వారిచే కావ్యములు వ్రాయించి, గౌరవించెను. తాను మహాకవియై గ్రంథములు రచించెను. రాజ్యపాలన కన్న కవితాగోష్ఠితో సంతోషించుచు గాలము గడపు చుండెను.

ఇట్లు వినోదములతో ప్రొద్దుపుచ్చుచుండఁగాఁ జోళ పాండ్యరాజు లొకరిపై నొకరు కత్తి దూయసాగిరి. దక్షిణ హిందూదేశమున నీ రెండు రాజ్యములు మిగుల ప్రసిద్ధములు. ఈ రెండు రాజ్యముల యున్నతిస్థితికిఁ గన్నుగుట్టి తురుష్కులు దండెత్త సమయమునకై వేచియుండిరి. ఓపికతో రాయలువారలకుఁ గొంతవఱకు సమాధానము కలిగించెను. కాని, తొల్లింటి రాజ్యవైభవ లక్ష్మివారి రెండు రాజ్యములనుండి తొలఁగినది. అది కారణముగా నా రెండు రాజ్యములు కొంతకాల మట్లే స్వాతంత్ర్యమును గోల్పోక నిలిచియుండినవి.

మధుర రాజధానిగ బాండ్యదేశమును చంద్రశేఖర పాండ్యుఁ డేలుచుండెను. తంజాపురము రాజధానిగఁ జోళ రాజ్యమును వీరశేఖర చోళుఁడు పాలించుచుండెను. ఉన్నట్లుండి వీరశేఖర చోళుఁడు మధురపై దండెత్తి

పాండ్యుని జయించెను. అతనిని రాజ్యమునుండి వెడల గొట్టెను. రాజ్యచ్యుతుఁడై, చేయునది లేక చంద్రశేఖర పాండ్యుఁడు విజయనగరమున కేతెంచి, రాయలపాద ములను గన్నీటితోఁ గడిగెను. రాయలు వానిని సాదరముగా లేవనెత్తి, కారణమడిగెను. అతఁడు తనకు సంభవించిన విపత్తును సావకాశముగాఁ దెలిపి "ప్రభూ! మాఁబోటి దుర్బలులకు మీరుగాక మఱెవ్వరు! తమ చిత్తమట్లు కావింపుఁడు" అని దీనముగా బలికెను. జాలిఁ గలిగించు నాతని వృత్తాంతమునకు సార్వభౌముని హృదయము ద్రవించి నది. వెంటనే నాగమనాయుని రప్పించి, దురాగ్రహంబుతో "వింటివా! వీరశేఖరుని దురాగతము. పొగరు తలకెక్కి నది కాఁబోలు. పాండ్యుని బాఱఁదోలి, తానే రెండు రాజ్యముల నేలుచున్నాఁడు. నీవు వెంటనే మాయానతి తలఁదాల్చి, సపరివారముగా నేగి, వీరశేఖరుని దుండగము నేలరాయుము. ఇతనిరాజ్య మితని కిప్పింపుము. చోళరాజ్య మున మాకు బ్రతినిధిగా నొకని నియమించి, మనకుఁ జెల్ల వలసిన కప్పమును రాఁబట్టుము. దారిబత్తెములకు నీకగు వ్యయమంతయు రాఁబట్టుము. శాంతి నెలకొల్పుము. పొమ్మ"ని యాజ్ఞాపించెను.

నాగమనాయకుఁడు చక్రవర్తి యాజ్ఞ శిరసావహించి, యాక్షణమే తగుసేనతో బయలుదేఱి, పాండ్యరాజ్యముపై దండెత్తెను. మొదట వీరశేఖరు నోడించి, యతనిరాజ్య మాక్రమించుకొనెను. పిదప, చంద్రశేఖర పాండ్యునకు

రాజ్యమీాయక, రాయల యాజ్ఞ నుల్లంఘించి, నాగమ నాయకుఁడు తానే రెండు రాజ్యములకుఁ బ్రభువయ్యెను. నాగమనాయకుని చర్య కచ్చెరువొంది, నిరుత్సాహముతో పాండ్యుఁడు, మఱల విజయనగరమున కేతెంచి, సవిస్తరముగా రాయలకు సర్వ వృత్తాంతమును నివేదించెను.

రాయలు విషయమాలించి, తోఁకఁద్రొక్కిన లేచి బుస్సుమను త్రాఁచువలె గోపించి "ఏమి! ఈ చిత్రము! నిన్ను మా విశ్వాసపాత్రుఁడవని నమ్మినందులకా యీ దుండగము. మా యాజ్ఞ నుల్లంఘించుట కాక పాండ్యునకు రాజ్యమీాయక, రెండు రాజ్యములకు నీవే యేలిక వైతివి. ఇట్లు చేయుమని మాయాజ్ఞ కాదు. వెంటనే పాండ్యునకు రాజ్యమప్పగించి, మా సన్నిధికి వచ్చునది" అని యొక యాజ్ఞాపత్రమును వ్రాయించి, నాగమనాయకునకుఁ బంపెను.

వార్తావహుఁడు వాయు వేగమునబోయి యాజ్ఞా పత్రమును నాగమనాయకున కందఁజేసెను. ఆతఁడందలి విషయములను సవిస్తరముగాఁ జదివించుకొని కొంతకాలము దీర్ఘముగా నాలోచించెను. ఏది యెట్లయిన నుత్తరము వ్రాయుట తప్పనిసరి యని గ్రహించి,

శ్రీ. శ్రీ. శ్రీ. రాయలవారి పాద సన్నిధికి :—
నాగమనాయకుఁడు వినయపూర్వకముగాఁ బంపుకొన్న విన్నపము.

ప్రభూ! నేను దేవరవారి యానతి నుల్లంఘింపలేదు. రాజ్య మరాజకమై గండరగోళ పరిస్థితియందున్నది. చంద్ర శేఖరుని పాలన ప్రజకుఁ గంటకముగానున్నది. అందుచే పాండ్యుఁ డాక్రమించుకొన్నాఁడు. మీఁదు మిక్కిలి చంద్ర శేఖరుఁడు తండ్రికౌరసపుత్రుఁడు కాఁడట. దాసీ పుత్రుఁ డట. రాజ్యమును జక్కదిద్దుటకై చాలవఱకు నా ధనమును వ్యయించితిని. రాజ్యమందు శాంతిభద్రతలు నెలకొను నంతవఱకు నా వ్యయించిన ధనము రాఁబట్టుకొనునంత వఱకు రెండు రాజ్యముల నేనే పాలింపఁదలంచి యున్నాను. కాఁగా, రాజ్య పరిపాలనయందు చంద్ర శేఖర పాండ్యుఁ డశక్తుఁడు. మఱల రాజ్యమాతనికిఁ గట్టఁబెట్టిన, ప్రజలు తిరుగుబాటగుదురు. దీని మూలమున సామ్రాజ్య మునకు ధన నష్టమగుటయేగాక, యితర రాజ్యములకుఁ జులకన యగును. అప్పుడు "గోటఁ దీర్పు పని గొడ్డటఁ దీర్పవలసివచ్చును. నేను రాజద్రోహిని కాను. ఇంతవఱకు నా శరీరమును సామ్రాజ్యమున కంకితము జేసితిని. ఈ విధ ముగానైన గొంత కాలము సుఖమున విశ్రాంతి బడయఁ దలఁచినాఁడను. ఇఁక తమ యిష్టానుసారము సేయుఁడు.

ఇట్లు,

మీ విశ్వాసపాత్రుఁడు,

కోట్యము నాగమనాయకుఁడు.

అని వ్రాయించి, విజయనగరమునుండి వచ్చిన వార్తా వహుని పరముగా రాయలకుఁ బంపెను.

నాగమ నాయకుఁడు పంపిన విజ్ఞాపన పత్రమును జూచుటతోడనే రాయల కనులెఱ్ఱఁబారినవి. సభను కలయఁజూచి "నిజముగా నీతఁడు రాజద్రోహి. రాజశాస నోల్లంఘనమే ద్రోహము. ఇట్టివానిని మన్నింపరాదు. ఈతనిని బట్టి తెచ్చు వీరుఁ డెవ్వఁడైన నీ సభయందున్నాఁడా!" యని మఱొకసారి పేరోలగమును దేరి పాఱఁజూచెను.

సభ నిశ్శబ్దమైనది. కొలువులోని వారందఱు పరస్పర ముఖావలోకనము గావించుకొనిరి. అం దెవ్వఱును నడుము బిగింప సాహసింపరైరి. కొంతసేపటికి విశ్వనాథనాయకుఁడు లేచి, ప్రభువునకు వందనమాచరించి, చేతులు మోడ్చి, "దేవరవారి యాజ్ఞయైన నాకుఁ దండ్రియైనను లక్ష్యము సేయక నాగమనాయకుని తమసన్నిధికిఁ గొనిరాఁగలను." అని వినయముట్టిపడఁ బలికెను.

విశ్వనాథ నాయకుని ధైర్యసాహసములకుఁ గొలువు లోని వారంద ఱబ్బురపడిరి. అంత రాయలు వికటముగా నవ్వి "ఔరా! నాగమ నాయకుని కుమారుఁడవు గదా! ఇది సమయముగా గుర్తించి, తండ్రితోఁ జేరఁగోరి, చక్రవర్తి యుత్తరు వపేక్షింప నుంటివా?" యని కొలువు కూటము మాఱుమ్రోగునట్లు గద్దించెను.

సభలో గుసగుసలు రేఁగినవి. కొంతసేపటికి కొలువు నిశ్శబ్దమైనది. రాయలు మౌన ముద్ర దాల్చియుండెను. ప్రభువులవారి మౌన మర్ధాంగీకారసూచనయని భావించి, యానాఁడే విశ్వనాథ నాయకుఁడు తనకుఁ దోడుగా గొంత

సైన్యమును వెంటఁగొని మధురాపురముపై దండెత్తెను. దండులో బట్టణ సమీపమందున్న మామిడితోటలో విడిసెను.

తండ్రి గౌరవార్థము మొకట సామ వాక్యములతో మందలింప నుద్దేశించి "నాయనా! మీరు రాయలవారి యుత్తరువును త్రోసి రాజు చేసితిరి. చేయుటయే గాక స్వాతంత్రముగా బ్రవర్తించుచున్నారు. పాండ్యుని రాజ్య మాతనికప్పగించి, ప్రభుసన్నిధానమును జేరుటయుత్తమము. అట్లు కానిపక్షమున మిమ్ము బలాత్కారముగా గొనిపోవుదు" నని విశ్వనాథుఁ డొక యుత్తరము వ్రాసి, తండ్రికడ కంపెను.

ఉత్తర మందినది. అందలి విషయములు గ్రహించి నాఁడు. గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించుచున్న ట్లున్నదని భావించినాఁడు. కొంతవడి దీర్ఘ మాలోచించి, యాశ్చర్య చకితుఁడై నాఁడు. తోడనే కుమారుని బురోభివృద్ధికిఁ బాటుపడువానివలె "నేను నీకొఱకే పాటు పడుచుంటిని. ఈ రహస్యము నీవు గమనింప లేవైతివి. ఇప్పటి వఱకు సామ్రాజ్యమునకు సేవఁజేయుట తోడనే మనకండలు కరుగు చున్నవి. నా జీవితము చరమదశ నందుచున్నది. ఇంతట నైనను మనము స్వేచ్ఛయనుభవింపవలదా! దీపమున్నపుడే యిల్లు చక్కఁబెట్టుకొనవలదా! మాఱు మాటాడక నాతో జేరుము" అని సాభిప్రాయముగా బదులుత్తరము వ్రాసి పంపెను.

విశ్వనాథ నాయకుఁడు తండ్రి వ్రాసి పుత్తెంచిన యుత్తరమును దిలకించినాఁడు. ఇంకను జనకునకు హృదయ పరివర్తన గలుగఁలేదని చింతిల్లినాఁడు, కాని, యింకొకసారి కటువుగా మందలించిచూచుట యుత్తమ మని తలంచి, "మీకు నీతులు బోధించునంతటి దిట్టనుగాను, కాని తండ్రీ కంటెను రాజే గొప్పవాఁడు. మీరు చేసినది స్వామి ద్రోహము. చక్రవర్తిగారి యుప్పును దినుచున్న మన మిట్లు చేయుట పాడిగాదు. నా పలు కాలింపుఁడు. అట్లుకానినాఁడు మన మిరువురకు యుద్ధము తప్పని సరియగును. అప్పుడు దైవము మీకుసాయపడఁడు. సజీవముగా మిమ్ముఁగొని పోయి రాయల కప్పగించి, నా ప్రతిజ్ఞ నెరవేర్చుకొందును. నా ప్రతిజ్ఞాపాలనమే సర్వసామ్రాజ్య పాలనమని భావింపుఁడు' అని గంభీర వాక్యములతో మఱొక యుత్తరము వ్రాసిపంపెను.

నాగమనాయకుఁడు కుమారుఁడంపిన లేఖా వృత్తాంతములను గ్రహించినాఁడు. కోప మొకవైపు సంతాపము మఱొకవైపు నాతనిని బాధించినవి. అందులకుఁ గటకటపడి "లేక లేక విశ్వనాథుని వరప్రసాదమున గన్న కొడుకు నేఁటికి నాపైఁ గత్తిదూయుటకు సాహసించినాఁడు. అభి ప్రాయము లేకీభవింపక పోవుటయే యిందుకుఁ గారణము. ఇంతకుఁ గాలము. ఇది నా దురదృష్టము." అని తలపోసి, కుమారునితోఁ బోరాడ సంసిద్ధుఁడైనాఁడు.

తండ్రికొమరులకు బోరు ప్రారంభమైనది. క్రమముగా నది తీవ్రరూపము దాల్చినది. నాగమనాయని దండులో

పలువురు హతమైరి. ధర్మాధర్మములను రణ రంగమే నిర్ణయించినది. అట్టి సంకుల సంగ్రామమున విశ్వనాథ నాయకుఁడు తండ్రిని సజీవముగా బంధించి, యంబారీ యేనుఁగుపై నెక్కించి, కొందఱ కావలియుంచి, సరాసరి విజయనగరాభి ముఖుఁడయ్యెను.

రాయలు కొలువుదీరి యుండెను. మంత్రులు, సామంతులు, దండనాథులుండిరి. మఱొక వైపు కవి గాయకు లుండిరి. తండ్రిని సంకెళ్ళతో బంధించి తెచ్చుచున్న విశ్వ నాథుని ప్రభువు వీక్షించినాఁడు. అతని ప్రతిజ్ఞా పాలనకు, స్వామి భక్తికి, మిగుల సబ్బురపడినాఁడు. సభ్యు లెల్లరు విశ్వనాథుఁడు మానవాతీతుఁడని వేనోళ్ళ శ్లాఘించిరి.

రాయలు బంధితుని నిలువెల్లఁ జూచి "ఏమి ? నాగమనాయకా ! ఇంత కాలము విశ్వాసపాత్రుఁడవై, యిట్టి ఘాతక మొనరించితివి." అని రాజ ఠీవి తొణికిస లాడఁ బలికెను. అందులకు నాగమనాయకుఁడు "ప్రభూ! ఇందు నా తప్పేమియు లేదు. మీ తండ్రిగారి హయా ములో పాండ్యరాజ్యము నాకు కుదువ యుంచఁబడినది. రాజ్యమరాజకమగుటచే, పాండ్య రాజ్యమునుండి బొక్క స మునకు ధనము చేరుట లేదు. అందును చంద్ర శేఖర పాండ్యుఁ డశక్తుఁడగుటచే శాంతి నెలకొల్పుట కిట్లు కావించి తిని. ఇఁక మీ చిత్త" మని పలికెను.

చంద్ర శేఖర పాండ్యుఁడా మాటలు సత్యమని యొప్పు కొనెను. అంతట విశ్వనాథుఁడు చేతులుమోడ్చి, తండ్రి

తప్పిదమును క్షమింప రాజును వేడెను. రాయలు సంతోష ముతో నాగమనాయుని మన్నించి, విడిపించెను.

తండ్రి కొడుకు లిరువురిండ్లకుఁ బోయిరి. అప్పుడు విశ్వనాథుఁడు తండ్రి పాదముల కెఱఁగి "నాయనా! ఇప్పుడు నీవు తండ్రివి, నేను కుమారుఁడను. ఇంతవఱకు మనము విరోధులము. నీ కుమారుఁడు స్వామి కార్య తత్పరుఁడని శ్లాఘింప వినుటకు కెంతయు నీకు ముదావహామేకదా!" అని వినయమున విన్నవించెను.

కుమారుని జ్ఞానగరిమకు, సాహసమునకు, స్వామి కార్యపరాయణతకు నాగమనాయకుఁ డమందానందమున బొంగినాఁడు, వెంటనే కుమారుఁడు జనకుని స్నానము జేయించి, నూతన వస్త్రధారణ గావింపఁజేసెను. ఆతనిచే బ్రాహ్మణ సమారాధనయు, దానధర్మములు సేయించెను.

విధ్యుక్త కార్యములు నిర్వర్తించిన తరువాత తండ్రి కుమారునితో "నీకు రాజ్యము కట్టవలయునని యిట్లు చేసితిని గాని, స్వామి ద్రోహము కొఱఁగాని పనియని నాకుఁ దెలియదా! మున్నొక పర్యాయము మీనాక్షీ సుంద రేశ్వరులు నాకుఁ గలలో గన్పడిరి. దేవి నాయందు బ్రసన్న దృష్టులఁబఱపి, 'యచిర కాలములో నీ కుమా రుఁడు నాకు నెలవైయున్న పాండ్య రాజ్యము నేకచ్ఛత్ర ముగా బాలింపఁగలఁడ" ని పలికి యంతర్ధానమందినది. అందులకు నిదర్శనముగా నిట్లు గావించితి" నని పలికెను.

ఆ మాట లాలించి, విశ్వనాథుఁడు వినయ ముట్టిపడ "జనకా! దేవి దయతో గావించిన యీ దేశమును నేను గాదనను. మనము నిమిత్త మాత్రులము. రాజ్యప్రాప్తి దైవసంకల్పము. జరుగవలసినది జరిగియే తీరఁగలదు" అని ప్రత్యుత్తరమిచ్చెను.

తరువాత వారు కొంతకాలము సుఖముగా నుండిరి.

చాలకాలము జరిగినపిమ్మట యొకనాఁడు నిండోలగమున రాయలాసీనుఁడై యుండెను. అట్టియెడ చంద్రశేఖర పాండ్యుఁడు లేచి, కరములు మోడ్చి "ప్రభూ! ఇఁక చాలకాలము రాజ్యము చేయఁజాలను. నా యశక్తత గమనించి, ప్రజలు నాపైఁ దిరుగుబాటుచేయ నుద్యుక్తులగుచున్నారు. కావున యేలినవారికేమో తెలుపుచున్నానని భావింపక విశ్వనాథ నాయకుని పాండ్య రాజ్యమున కభిషేకింపుఁడు. అర్హుఁడు. గుణశాలి. ఇంతకుమించి మీతో బ్రసంగింపఁజాలను." అని సవినయముగా బలికెను.

పాండ్యుఁడు గావించిన విజ్ఞప్తిని సాకల్యముగా విని, రాయలు కొంతవడి యాలోచించెను. సభ్యులెల్లరు విన, రాయలు, చిఱునవ్వు మోమున జిందులాడ, విశ్వనాథ నాయకు నవలోకించి "నీవు మాకును, మా సామ్రాజ్యమున కనేక పర్యాయము లుపకరించియున్నావు. ఇంతకుఁబూర్వము నీకొక రాజ్యమిత్తుమని వాగ్దానము చేసి యున్నాము. కావున నీవా రాజ్యమున కాధిపత్యము వహింపుము. రాజ్యమున శాంతి భద్రతలు నెలకొల్పుము.

శాంతి యుండినగాని ప్రభుత్వమునకుఁ జెల్లవలసిన కప్పము సక్రమముగా జేరదు.'' అని యాజ్ఞాపించెను. వెంటనే సహాయముగానలసినంత సైన్యము నిచ్చి, పంపెను.

విశ్వనాథ నాయకుఁడు రాయల యానతి దలఁదాల్చెను. వినయమున నమస్కరించెను. తండ్రి యను మతిఁ గైకొనెను. ఆ మఱునాఁడే యతఁడు మధురానగరమును జేరెను.

ఆతఁడు రాజ్యమున కేగి చూచునప్పటికి, నగరమున కన్నివైపుల దట్టమైన యడవులు పెరిగియుండెను. అవి చోరుల కునికిపట్టుగా నుండెను. ఘాతుక మృగములు విచ్చలవిడిగా సంచరించుచుండెను.

పట్టణము చుట్టునుగల కోట గోడలు శిథిలావస్థయందుండెను దేవాలయములు, రచ్చ కూటములు పాడరియుండెను. ఇట్టి పరిస్థితిని గన్నులారఁగాంచి, సరిజేయుట కుద్యమించినాఁడు. ప్రజల కుపద్రవము లెక్కువైనవి. ఖజానాలోఁ జాలినంత ధనము లేదయ్యెను. క్రొత్త పన్నులీపరిస్థితులలో విధించిన ప్రజలలో నలజడి యెక్కువగునని తలఁచెను. అందుచేఁ దనకు తండ్రి యొసఁగిన ద్రవ్యమును వ్యయించి, శిథిలముల నుద్ధరించెను.

విశ్వనాథ నాయకుఁడు గద్దెనెక్కిన తరువాత అరియనాథ మొదలారిని మంత్రిగను, దండనాయకునిగ నియమించుకొనెను. అతఁడు మిగల [illegible]ఁడు. విశ్వాసపాత్రుఁడునై యుండెను. విశ్వనాథుఁడు [illegible]

పాండ్య రాజ్యములను పాలించినను, తన వ్యక్తి స్వాతంత్ర్యమునకు భంగము గలిగించుకొనలేదు. తాను పాలించినంత కాలము విజయనగర సామ్రాజ్యమునకుఁ గప్పము గట్టుచు, నా రాజ్యమునకు లోఁబడి ప్రవర్తించుచుండెడు వాఁడు.

ప్రస్తుతము నయనానందకరముగా గవఁబడుచున్న మీనాక్షీ సుందరేశ్వరుల దేవాలయములు, ప్రాకారములు, మంటపములు; మున్నగునవి యరియనాథ మొదలారి సాయమున విశ్వనాథనాయకుఁ డుద్ధరించినవే!

ఇంతలో క్రీ. శ. 1530 లో శ్రీ కృష్ణదేవరాయలు కాలగర్భమున లీనమయ్యెను. ఆయన తమ్ముఁ డచ్యుత దేవరాయలు విజయనగర సింహాసన మధిష్ఠించెను, ఆ కాలమున నచ్యుతరాయల మఱఁదలి మగఁడైన చెన్నప్పనాయని చోళ రాజ్యమునకుఁ బ్రతినిధిగా నియమించెను. కావున నిది విశ్వనాథుని యధీనమునుండి తొలఁగినది. అట్టి సమయముందే కావేరీ తీరమున కిరువైపుల దట్టముగా నరణ్యములు పెరిగియుండెను. అందుచే నా ప్రదేశము చోరుల కిరవై యుండెను. కావున శ్రీరంగేశుని దర్శింపఁ బోవు యాత్రికులకు బాధాకరముగానుండెను. ఇట్టుండుట గుర్తెఱిఁగి, విశ్వనాథనాయకుఁడు వనముల గొట్టించి, బాటలు వేయించెను. యాత్రికుల మన్ననకుఁ బాత్రుఁ డయ్యెను. ప్రజా సౌకర్యముల కెన్ని విధములుగనో పాటు పడినాఁడు. చెఱువులు, త్రవ్వించి, కాలువలు, తీయించి

నీటి సదుపాయములు కలిగించినాఁడు. రైతులకుఁ బొలములు, ధనమునిచ్చి, వ్యవసాయ మభివృద్ధికిఁదెచ్చెను. రాజ్యమునకు రైతు వెన్నుఁబూసయని గుర్తించినాఁడు, అందుచే నా కాలమున కఱవు నెవ్వరైన నెఱుంగకుండిరి. రాజ్యమందు చిరస్థాయిగా శాంతిభద్రతలు నెలకొలిపెను.

నేఁటి మండలములగు మధుర, రామనాథపురము, తిరునెల్వేలి, తిరుచినాపల్లి, కోయంబుత్తూరు, సేలము, తిరువాన్కూరునందు గొంత భాగముచేర్చిన, విశ్వనాధనాయకుని రాజ్యముగా గణింపవచ్చును.

విశ్వనాధుఁడు తన యేలుబడి కాలములో వ్యవసాయము సర్వతోముఖముగా నభివృద్ధియగుటకు "పాళియ పద్ధతిని" బ్రవేశపెట్టెను. అందుచే బంజరు భూములు సాగులోనికి వచ్చినవి. ప్రాచీన రాజవంశీయులకు జీవనోపాధికలిగినది. ప్రజకు మహమ్మదీయుల బాధతొలఁగినది.

ఈ పద్ధతిననుసరించి యాతఁడు తనరాజ్యమునంతయు డెబ్బదిరెండు పాళెములుగా విభజించెను. ఒక్కొక్క పాళెమున కొక్కొక్క ప్రతినిధియధికారి యయ్యెను. వారు "పాళెగాండ్ర" నఁ బడిరి. పాళెగాండ్రు తమ రాఁబడిలో మూఁడవవంతు విశ్వనాధునకుఁ జెల్లించుచుండిరి. యుద్ధ కాలములో వారు తమయేలికకు ధనజన సహాయము సేయునట్లొడఁ బడిరి. ఇట్లున్నను విశ్వనాధుఁడు విజయ నగర సామ్రాజ్యముపట్ల భక్తి విశ్వాసములు వీడలేదు.

ఇట్టి సత్పరిపాలకుఁ డగుటచే, నీతఁడు "పాండ్యకుల సంస్థాపనాచార్యుఁడు" అను బిరుదు వహించెను. తన పాలన కాలములో సొంతనాణెములు ముద్రించెను. క్రీ. శ. 1564 లో విశ్వనాథ నాయకుఁడు కాశీ విశ్వేశ్వరుని సన్నిధాన మలంకరించినాఁడు.

ఇతని పరిపాలనవలన నాంధ్ర ద్రావిడులకు మైత్రి కుదిరినది. కావున నితఁడిరువురకుఁ బూజనీయుఁడని వచించుట యతిశయోక్తి కాదు. ఈతని ప్రతిజ్ఞాపాలన, రాజభక్తి, కార్యదీక్ష మొదలైన గుణములు సర్వుల కనుసరణీయములు.

## ౮. ఆత్మార్పణ

క్రీస్తుపూర్వ మైదవశతాబ్ద మధ్యకాలమున నైరోపా ఖండమున గ్రీసు దేశము విరాజిల్లినది. ఆ దేశమునకు ఏథెన్సు నగరము శిరోభూషణముగా నుండినది. అందు కళలు, శాస్త్రములు వర్ధిల్లినవి. ఆ నగరము, చరిత్ర కారులను, శిల్పులను, కవులను, రాజకీయవేత్తలను గడుపారఁగని ఖండాంతర కీర్తి నార్జించినది.

ఆ దేశమందు సోక్రటీసు, క్రి. పూ. 468 లో జన్మించెను. ఆతని తల్లిదండ్రులు పేదరీటు, సాఫ్రోనిస్కోలు ఆయన తండ్రి పేరొందిన శిల్పి. తల్లి మంత్రసాని వృత్తిలో గాలము గడపెను. చివఱదశలో సాఫ్రోనిస్కో తనకున్న విలువఁగల యాస్తిని కుమారునకు సంక్రమింపఁ జేయుమని విశ్వసనీయుఁడగు నొక బాంధవుని పరము గావించెను. కాని, సాఫ్రోనిస్కో కాలగతిఁ జెందఁగనే బంధువా ధనము నపహరించి, విశ్వాసఘాత మొనరించెను. అందుచే నిరాధారుఁడై సోక్రటీసు బాల్యము నుండియు తండ్రివృత్తినే యవలంభించి కాలము గడపుచుండెను.

ఆ కాలమున ఏథెన్సు నగరమున వర్ధిల్లిన మహామహుల కడ బాల్యమునందు సోక్రటీసు విద్యాభ్యాస మొనరించెను. ఒజ్జలయెడఁ గలిగిన గుణములు, తెలివి తేట లాతనియందు రూపొందినవి. ఆతఁడు లలిత కళలందు

మిగుల నేర్పు సంపాదించెను. కులమతములు పాటింపక యాతఁ డెవ్వరికడనైన గ్రొత్తవిద్యలు నేర్చుకొనుటయం దాసక్తిఁ గలవాఁడు.

సోక్రటీసునకు యుక్తవయసు రాఁగానే వివాహ మైనది. ఆయనకు గ్జాంతిపి, మిర్టోలు అను నిద్దఱు భార్య లుండిరి. రెండవ భార్య గుణవంతురాలు, కాని, ప్రథమ భార్య గయ్యాళి. అగుటచే నాతనిని ధనార్జనకై మిగుల బాటుపడమని తెలుపుచుండెడిది. అయినను కుటుంబపోషణ కెంత ధనమవసరమో యంతె సంపాదించి తృప్తినందుట సోక్రటీసునకు గల ముఖ్యాభిప్రాయము. ఆతనికి జ్ఞానసంపా దనయందుఁగల యాసక్తి ధనార్జనయందు లేకుండెను. ఎక్కువ ధనము సంపాదించుటకన్న యార్జించినధనమును మితముగా వ్యయించుట మేలని యాతని భావము. ఇంతకుఁ దన నిరాడంబర జీవితమే కారణము.

సోక్రటీసు వికృత స్వరూపి. కాని యాతని ఫాల భాగము విశాలమై జ్ఞానసంపద కునికి పట్టుగానుండెడిది. ఆతఁడు చూపఱకి కాకపోవుటచే నితరులాతనినేవగించు చుండెడువారు. అతఁ డెండవానల కోర్చెడువాఁడు. చాల దూరమైనను గాలినడకతో నడచువాఁడు. శ్రమ, విసుఁగున కిసుమంతయు వెనుదీయనివాఁడు. ఆతని హృదయమున క్షమ, శాంతి, కార్యదీక్షమున్నగు గొప్ప గుణము లాకృతి నొందియుండెను. ఆతఁడు స్వేచ్ఛాజీవి. వ్యక్తి స్వాతంత్ర్య ముపై నాతనికి బట్టుదల మెండు. ఆతని యాకారమువలెనే

మనోవ్యాపారముకూడ లోకవిరుద్ధముగానుండెడిది. ఇందుల
కాతఁడు యదార్థవాదియగుటయే కారణము.

ఆతఁడు లోకమునకు జంకక, లోకుల గుణదోషము
లను విమర్శించుచుండెడువాఁడు. అందుచే జాల మంది
కాతఁడు గిట్టకుండెను. అతఁడు తన యాంతరాత్మ యెట్లా
డించునో యట్లే వర్తించుచుండెడువాఁడు కాని, యితరుల
మెప్పు సంపాదింపఁజూచువాఁడు కాకుండెను. ఈ కారణ
మునఁ గొందఱాతని నభిమానించుచుండెడువారు.

ప్రతి వయోజనుఁడు సైనికశిక్షనంది, దేశసేవ జేయ
వలయునను నిబంధన యానాఁటి గ్రీకుశాసనమై యుండెను.
మాతృదేశాభిమాన మాతని కుగ్గుపాలతో గఱచిన
గుణము కావున సోక్రటీసు సైనికుఁడయ్యెను. ఒకానొక
యుద్ధమున సోక్రటీసు తన పరాక్రమమునుజూపి, పేరొందెను.
ఆకలి దప్పులకోర్చి పోరాడెను. అందొక సోదర సైనికుఁడు
గాయపడఁగా నాతని కన్నివిధముల సాయముజేసెను.
ఆ యుద్ధమందు సాటిలేని పరాక్రమము జూపిన వారికి
బహుమానము లీయ నధికారులు సంకల్పించిరి. సైనికాధి
కారి క్షతగాత్రుఁడైన యుద్ధవీరున కీయఁదలంచెను. కాని,
యాతఁడు బహుమానమున తానర్హుఁడు కాఁడనియు,
సోక్రటీ సందులకుఁదగినవాఁడని విన్నవించెను. గాని,
ఫలవంతము కాకపోయెను. సైనికాధికారి యభీష్టమే
కొనసాగినది. ఇట్టి వివరీత చర్యకు సోక్రటీ సుమంతయుఁ
జలింపలేదు. ఇందులకుఁ దన క్షమాగుణమే తార్కాణము.

ప్రతిదినము ప్రాతఃకాలమున సోక్రటీసు ధ్యాన నిమగ్నుఁడై యొకచోట నిలిచియుండెడువాఁడు. అందాతని యాలోచనపూర్తియైనసరి, లేకున్న మధ్యాహ్నమువఱకైన నచ్చటనే యుండెడువాఁడు. చూపఱకీపరిస్థితి విపరీతముగా దోచుచుండెడిది. 'ఏ యాచరణ సామాన్యజనులకు విరుద్ధముగా దోచునో, యది మహానుభావులకు క్రమబద్ధముగా నుండుట సహజము.

గ్రీసుదేశస్థులకు మఱొకసారి జీలియమ్ కదన రంగమున యుద్ధము తటస్థించెను. సోక్రటీసు మూర్తీభవించిన సాహసమట్లు ఖడ్గకవచధారియై పోర నుద్యమించెను. అతనిని జూచుటతోడనే శత్రు సైనికుల గుండెలవియుచుండెను. కాని విరోధి బలమెక్కుడైన కారణమున గ్రీకుదండు భీతిల్లి పలాయనమంత్రము పఠింపసాగెను. అప్పుడు సోక్రటీసు యుద్ధరంగమున నిలిచి సోదర వీరులారా! ప్రాణము పోకకు భీతిల్లకుఁడు. మానవునకు జనన మరణములు సహజములు. పుట్టినవారేనాఁటికైనను గిట్టకమానరు. సాహసించి జయమో! స్వర్గమో! గొనుట వీరలక్షణము.

దేశాభిమానమును వీడుట కంటె ప్రాణత్యాగము కీర్తిదాయకము. నేను మిమ్మనుసరించియుందును. జడియకుఁడు. శరీరమున బ్రాణమున్నంతవఱకుఁ బోరాడుఁడు.'' అని యెలుఁగెత్తి వారికి ధైర్యసాహసములు రేఁకెత్తించెను.

కాని, కాలము తప్పివచ్చినప్పు డాతని ధైర్యప్రబోధము ఫలవంతము కాకపోయినది. ఐనను సోక్రటీసు విక్రమము సన్నుతింపఁబడినది.

సోక్రటీసునందు మఱొక విశిష్టగుణముండెడిది. సామాన్యులతో నాతఁడు వ్యర్థముగా భాషించెడువాఁడు గాఁడు. తన బుద్ధికి నచ్చిన వారితో మాత్రము మితముగా భాషించెడువాఁడు. ఆతని హృదయము విశాలమై గంభీర భావములతో తొణికిసలాఁడుచుండెడిది. ఆతని సంకల్పములు విశ్వమానవ కల్యాణమునకు చక్కని రాచబాటలై యుండెడివి. ఇట్లుండఁగా నాతనికి సైనికోద్యోగమున నున్నత పదవి లభించెను.

ఆ కాలమున గ్రీకు దేశమున నెన్నికలు జరిగెను. సోక్రటీసు సెనేటు సభ్యుడుగా నెన్నికైనాఁడు. ఆ సభయందు నైదు వేలమంది సభ్యులుండెడివారు. అందొక్కొక్క తెగకేఁబదిమంది సభ్యులవంతున పది తెగలుండెడివి. ఆ పది తెగల నుండి యెన్నుకోఁబడిన సభ్యులు కార్యాచరణ సంఘముగా నేర్పడెను. సోక్రటీసు కార్యాచరణ సంఘమున కధ్యక్ష పదవి నలంకరించెను.

ఆఁ నాటి నుండియు సోక్రటీసు తన కార్యకలాపములను న్యాయబద్ధముగ, నిర్దాక్షిణ్యముగా నెరవేర్చుచుండెను. ఆ కాలమున గ్రీకు దేశమున యుద్ధనిహతులైన వీరుల కంత్యక్రియలు వైభవముగా జేయుట యాచారమై యుండెను. గత యుద్ధములో నెనిమిదిమంది సేనానాయకులు భీతిల్లి పాఱిపోయిరన్న నిందకుఁ బాత్రులైరి. శాసనోల్లంఘన వారిపై మోపఁబడెను. అందుచే వారు శిక్ష కర్హులని ప్రజాభిప్రాయమైయుండెను. కాని నేరస్థులగు సేనానులు

క్రమమైన సమాధాన మొసగిరి. ప్రజాసామ్యవాదనలో వారి సమాధానము నెగ్గకపోయెను. అందుచే నీ విషయము ప్రజాసభలో నోటునకుఁ బెట్టవలసివచ్చినది. అందు ప్రజా పక్షమే గెలిచినది. కొందఱు సభ్యులు న్యాయమని వాదించిరి, ఇట్టి న్యాయబద్ధముకాని విషయము నోటునకుఁ బెట్టుట చట్టవిరుద్ధమని సోక్రటీసు ప్రజావాదులను నిరాకరించెను. "విషయము న్యాయసమ్మతమును, చట్టబద్ధమునై యుండ వలయును. అట్టి యంశమునకే నేను దాసుఁడను" అని యానాఁటి సభలో సోక్రటీసు గంభీరముగా నుద్ఘాటించెను. అంతలో సభ ముగిసినది.

కొంతకాలము జరిగినపిమ్మట గ్రీసుదేశ పరిపాలన బాధ్యత మఱొకపక్షము వారి చేతులలోఁ బడినది. నిరంకుశాధికారు లా నగరమును బాలింపదొడగిరి. వారి పాలనలో భయంకర దేవత నాట్యమాడుచుండినది. రాజకీయముగా వారితో వ్యతిరేకించినవారును, వేఱుకారణములచే విరోధించినవారు ప్రస్తుత పరిపాలకుల యాగ్రహమునకుఁ బాలగుచుండిరి. తుద కట్టివారు మరణదండనకు వశులగుచుండిరి. నిర్ధను లొకమూఁకగాఁ జేరి, ధనికులఁ దెగటార్చుచుండిరి. అమాయిక ప్రజలగోడరణ్యరోదనము కాఁజొచ్చెను. నిరుపయోగులు పైకి వచ్చుచుండిరి. ఇంతయేల, కొలఁది కాలమునకే గ్రీకు పరిపాలన తలక్రిందైనది. ఇట్టియెడ న్యాయమునకుఁ గట్టుబడిన యేవ్యక్తియైనను సహించి యూరకుండఁ గలఁడా!

ఇంతకుముందు నిలచియుండిన సైనికోద్యోగుల శిక్ష యిప్పుడమలులోనికి వచ్చినది. నూతనపక్షమా నేరస్థులతోఁ బాటు, వారికి గిట్టని మరి నలుగురిని శిక్షింప, నధ్యక్షున కాజ్ఞ యిచ్చిరి. సోక్రటీసు వారి యాజ్ఞాపత్రమును గైకొనెనే గాని, దానిని నిరాదరణఁ జేసెను. అట్లు చేయుట, తనపదవికిఁ, మదకుఁ దన కపాయము సంభవించునని యాతఁడు భీతిల్ల లేదు. ఒకవేళ విపత్తు సంభవించినను జలింపని ధైర్యశాలి కదా! సోక్రటీసు అచలమును చిన్నగాలులు కదల్పలేవుకదా!

పరిపాలకుల యానతిని తృణీకరించి, వెంటనే సోక్రటీసు గృహాభిముఖుఁడగుచు వారితో "న్యాయసమ్మతము గాని దేనినైనఁ జేయఁజాలను. అట్టి చో నాకెట్టి విపత్తు సంభవించినను దలఁదాల్చెదను" అని గంభీరముగా బలికెను.

అది మొదలు నిరంకుశ పాలకులుసేయు ప్రతి కార్యమును ప్రతిఘటించుచుండెను. వారి చర్యలను తూర్పారఁ బట్టుచుండెను. అప్పుడు వారి యాగ్రహము మిన్నుముట్టినది. తత్ఫలితముగా వారు. "ఏథెన్సు నగరములో నెవ్వరైనను సోక్రటీసు వాదనను బలపఱచరాదనియు, నాతనితో యువకులెవ్వరు సంప్రదించరాదనియు" కఠినముగా శాసించిరి. ఈ శాసనము సోక్రటీసు మనోధైర్యమును తగ్గించుటకుమారు, వృద్ధికి దోహదమైనది.

ప్రభుత్వము క్రుద్ధమైనపుడు, నిరంకుశత్వమును చెలాయించునపుడు, నిట్టి యసందర్భములు కలుగక మానవని

యాతఁడు భావించెను. ఇదే విషయమును తన యిష్టాగోష్ఠిలో బలువురతో విమర్శించుచుండెడువాఁడు. కాని యప్పటి ఏథెన్సు నగరము నిరంకుశ వాతావరణమునందే లీనమైయుండెను. ప్రజలు చాలవఱకు తమోవృత్తిలో నుండిరి. వారి భావములు కలుషితములై యుండెను. వారికి జ్ఞానభానూదయమెట్లు కలుగునా? యను విచార మాతని మనోవీధి నాటుకొన్నది. చేఁజేత తన యధ్యక్షపదవిని వదలుకొన్నాఁడు. అది మొదలుదయము సాయంకాలము వీథులందు తిరుగుచుఁ బ్రబోధ నాయకుఁడుగాఁ దయారైనాఁడు. జీవనోపాయము లేక వీథులలో దిరుగాఁడు మూఁకను బోధింప మొదలిడినాఁడు. వీథులందు కూడలిస్థలములలో నెక్కుమందిని సమావేశపఱచి, జనుల కర్తవ్యమును, ప్రస్తుత ప్రభుత్వ విధానమునుగూర్చి ముచ్చటించెడువాఁడు. పర్యవసానమునఁ బ్రజలవలంబింపవలసిన మార్గమును సూచించుచుండెను,

తాను బోధించు వాక్యములు ప్రౌఁడు బొంగరములు లేని వ్యర్థ ప్రలాపములుగావు. ఉపన్యాసమునకు ముందు పథకమును నిర్ణయించుకొని మాట్లాడుచుండెను. అతని యుపన్యాసము సామెతలతో, జాతీయ పదములతో మిళితమై యుండెడిది. శ్రోతల హృదయము కొంత వికసించినట్లు కనఁబడినచో, నాతఁడు కృతకృత్యుఁడైనట్లు సంతోషించుచుండెను.

ప్రజలకు నైతికముగా సాంఘికముగా బలము చేకూర్చుటయే యాతని ముఖ్యాశయము. ఇట్లనుదినము

ప్రజా సేవలో మునిగి తేలుచుండుటకు తన వృత్తినిగూడ విసర్జించెను.

ఒక్కొక్కనాఁడు సోక్రటీసుదయమున లేచి, కాలకృత్యములు తీర్చుకొని, వ్యాయామ క్రీడారంగముల కేగెడువాఁడు. అందు పరిశ్రమించు యువకులకు వారి భావి కర్తవ్యముగూర్చి ప్రబోధించుచుండెను. వారు బాగుపడుటయే యాతని ముఖ్యోద్దేశమని వారి కెఱిగించెను.

మధ్యాహ్న సమయములందు విపణి వీధులలో బేరసారములాడు జానపదుల దగ్గఱ కేగి వారి కర్తవ్యమునుగూర్చి యుపన్యసించుచుండెను. తీరిక సమయములలో జెఱసాలకుఁ బోయి, యందలి నేరస్థులను మందలించెడువాఁడు. వారి దీనస్థితిని జూచి జాలిపడి, వారి విమోచన మార్గమును బోధించుచుండెను.

సాయంసమయములందు కార్ఖానాలనుండి, కచేరీలనుండి జనులు తండోపతండములుగా వచ్చుచుండెడువారు. వారినందఱ నొకచోటఁ జేర్చి, వారి వృత్తులందలి కష్టనష్టములను వివరించుచుండెను. వారి వ్యక్తి స్వాతంత్ర్యము గాపాడుకొను మార్గము తెలుకపఱచెను. వారి భిన్నభిన్న పరిస్థితులను గమనించి యొక రేవునకు దెచ్చుచుండెడువాఁడు.

సోక్రటీసు విజ్ఞానవేత్త, ఆరితేఱిన వక్త. సునిశిత విమర్శకుఁడు. ఆతని వచోధోరణి కందఱు ముగ్ధులగుచుండెడువారు. క్రమక్రమముగా నాతని యుపన్యాసమాలింప, ఏథెన్సు నగరవాసులే గాక, పరిసరప్రాంతము

నుండి జనులు గుంపులుగుంపులుగా వచ్చుచుండెడువారు. చాలవఱకు సామాన్య ప్రజానీకమును తనవైపు నాకర్షించి నాఁడు. కాని యధికారుల లోపములను విమర్శించునప్పుడు చాలమంది కీతనిపై గోపము కలుగకపోలేదు. ఈతనిపై వారు ప్రశ్నవర్షమును గురియించి, సమాధానమభిలషించి వారి వారి ప్రశ్నలకు సదుత్తరములిచ్చెను. వారాంతరంగికముగా దృప్తిఁ జెందినను, పైకి మాత్రము తృప్తిలేని వారివలెఁ గన్పడుచుండిరి. భగవంతుఁడంతటివాఁడు సైతమందఱ మెప్పింపలేఁడు కదా?

ఈ కారణమున సోక్రటీసు కొందఱి యున్నతాధికారులకు, వ్యాపారసంస్థలకు విరోధుఁడైనాఁడు. ఐననేమి. ప్రాణమున్నంతవఱకు ప్రజలకు ధర్మమార్గము బోధించి, వారిని బాగుసేయుటయే యాతని జీవితపరమావధిగా నిర్ణయించుకొనెను. సత్యమును ప్రతిష్ఠించుటకే దీక్షగైకొన్నవాఁడు గాన పట్టుదల వీడలేదు. కార్యసాధకులు కష్టసుఖములను లెక్కసేయరు కదా!

సోక్రటీసు ప్రజాహృదయములను సత్యమార్గమునకు ద్రిప్పు యంత్రగాఁడనని, తనలో దాననుకొనుచుండెను. అతఁడు పూనుకొన్న మహత్తర కార్యమునకు తాను నిమిత్తమాత్రుఁడనని విశ్వసించెను. తన కర్తవ్యము భగవదాదేశమని గుర్తించినాఁడు. అట్టిదాని లోతుఁపాతులను దుదముట్ట గ్రహింపఁ గంకణము గట్టుకొన్నాఁడు.

తనపై సానుభూతి చూపుచున్న కొందఱు వ్యక్తు లాతని యనుదిన జీవితాధారమున కుపాధి కల్పించిరి. ఇట్టి సంకల్పము కొంతమందిలోనైన గలుగుట సోక్రటీసు పూను కొన్న మహత్తర కార్యమునకు భావి జయసూచకముగా నుండెను. సాన రాపిడిచేత వజ్రము సన్నఁబాఱినను రమణీయకాంతుల నీనుచుండును. అగ్నిలో గాలి, సమ్మెట పోటుల నలిగి కదా యినుముసాగి ప్రజోపయోగమునకు బనికివచ్చుట. కార్యసాధకునకు ముందెన్నియో యంత రాయములుగలుగుట సహజము. అట్టివానిని లెక్క సేయక సాగిపోయినవాఁడే కృతకృత్యుఁడు. ఆతని జీవితమే ధన్యతమము.

తన ప్రబోధము క్రమముగా వినుచుండుటచేత చాల వఱకు బ్రజలలో నాందోళన హెచ్చినది. ఆతఁడు తమ యోగక్షేమముల నాకాంక్షించి యుపన్యసించుచున్నాఁడని గ్రహించిరి. దినములకొలఁది వారి హృదయ క్షేత్రములలో నాటుకొన్న ప్రబోధ బీజములు మొలకలెత్తనారంభించినవి. కాలక్రమమున నాతఁడు వారికొక పరిచితవ్యక్తిగా నయ్యెను.

ఏథెన్సు నగరవాసులు ముప్పాతిక మంది సోక్రటీసాక నూతన బోధనామార్గ స్థాపకుఁడని గ్రహించిరి. నాఁడు మొదలుగా నాతని కనుయాయులేర్పడిరి. కొంద ఱాతని వెంట నెండగాలులకోర్చి తిరుగు శిష్యులుగా నేర్పడిరి. అట్లేర్పడినవారిలో పైరో, క్రిషియాను అనువారు ముఖ్యులు.

సోక్రటీసు వికారస్వరూపము సేవగించినవారు, ఆతని విమర్శలను నిరసించినవారు కాలక్రమమున నాతని దాఁపుఁ జేరసాగిరి. ఆయన యుపన్యాసమునందలి సత్యమును, ధర్మమును గ్రహించిరి. శూన్యవాదులకు, వితండవాదులకు సోక్రటీసు గొడ్డలిపెట్టుగాఁ దయారైనాఁడు.

సోక్రటీసు పాఠశాలనుగాని, కళాశాలనుగాని స్థాపించ లేదు. కాని తానొకచోట జేరి నోరువిప్పెనా ? పాఠశాలలు, కళాశాలలు మానుకొనియైనను విద్యార్థులు, యువకులాతని చుట్టు మూఁగి వినుచుండెడువారు. ప్రజానీకములో నింతటి పరివర్తనగలిగినందుల కతఁడే యాశ్చర్యపడుచుండెను ! ఇట్టి పరిస్థితి గల్పించిన దేవదేవునకు జోహారులర్పించుచుండెడు వాఁడు.

కొన్ని వేళలయందు సోక్రటీసు యనుమతి మేరకు శిష్యులు వాడవాడలలో ప్రబోధమునకు గడంగెడువారు. వారును గొన్ని నూతన సిద్ధాంతములను సృష్టించి, గురువు గారి యంగీకారము వడసి, ప్రజలకెఱుకపఱచుచుండిరి. ఇంతటి చైతన్యము గలిగించు శక్తి సామాన్య మానవునకుఁ గలుగునా ? యని సోక్రటీసు విషయమును గ్రహించిన విదేశీయులు విస్మయచిత్తులగుచుండిరి.

ఎంతకుఁ జాలనివారు కొందఱు రాజకీయరంగములో ప్రవేశించి, కీర్తి ధనముల నార్జించిరి. ప్రభుత్వోద్యోగ ముల బొతుకొన్నవారు కొందఱు. కపటనాటకములాఁడి దేశమునఁ బలుకు బడి సంపాదించినవారు మఱికొందఱు.

సంపన్న కుటుంబములలో జన్మించినవారమని యింకఁ గొందఱు పరస్పరముగా సంభాషించుకొని, సోక్రటీసు ప్రయత్నములఁ జెఱుపఁజూచిరి. ఆతఁడు వారి గుట్టును బైటఁబెట్టుటయే యందులకుఁ గారణమని మఱికొంద ఱూహించిరి.

వారికి సోక్రటీసు పైఁబొడమిన యీర్ష్యాద్వేషములు ఫలవంతము గావించుకొనుట కుపాయాంతరము గనబడ కుండెను. అందుచే నా సమయమున ఏథెన్సు నగరమున నీను మిగిలిన కవులచే సోక్రటీసు నాస్తికవాదియనియు, ప్రలాపియనియు నాటకములు వ్రాయించిరి. నాటకాంశ ములను రంగస్థలములమీఁదికి కూడ నెక్కించిరి. కాని సరిపడనివారెన్ని విధముల కీఁడు గలిగింప యత్నించినను విఫలమనోరథులగుచుండిరి. ప్రకాశించు లోకబాంధవుని మార్గమును చిఱుమబ్బులు నిరోధించిన శాశ్వతముగా తేజో రాశి మాయము కానేరదు కదా!

తుదకుఁ జేయునది లేక సోక్రటీసునకు గిట్టనివారు లేనిపోని కారణాలు కల్పించి యాతనిని నిందింపసాగిరి. అమాయక ప్రజానీక హృదయములను చెడగొట్టినాఁడని, నోరెఱుఁగని యువకుల సత్ప్రవర్తనను కలుషీభూత మొన రించినాఁడని యాతనినిగూర్చి పరిసర గ్రామాదులలో ప్రచా రము సేయింపసాగిరి. ఆతఁడు దుండగీంద్రనాయకుఁడని, వాఁడ ద్రిమ్మరియని పసివారలచే గేలిచేయించిరి.

ఒక దినమందు వారొక మైదాన ప్రదేశమున పట్టణ ప్రజలను సమావేశపఱచిరి. అందొక రాజకీయోద్యోగి గంభీరముగా ప్రజాశ్రేయస్సు కోరి, వారి నుద్దేశించి "అయ్యలారా! ఇంతకుముందు మనము కని విని యెఱుఁగని చిచ్చు మన పట్టణమునఁ బ్రవేశించినది. ఉపేక్షించిన మనకాపద సంభవించుట నిజము. శరీరమునకాపాదించిన విష రోగమును, మొదలంట తుడిచివేసినగాని, యారోగ్యము కుదురదుకదా! మీ బిడ్డలను - నోరెఱుఁగనివారిని — సోక్రటీసు పాడుచేయుచున్నాఁడు. అతని వాక్యములు, బోధ, ప్రస్తుతము రుచికరముగనేయుండును, కాని, పర్యవసానమున నట్టి యుపన్యాసముల బండారము బైటబడఁగలదు. ఇంతకుముం దాతనిని చాలమంది దేశసేవకుఁడని గుర్తించినారు. ఇప్పుడు దేశద్రోహిగాఁ దయారైనాఁడు. ఇంటిలో మనతోఁబాటు పాము కాఁపురముసేయుచున్న మన మెంతకాలము నిర్భయముగా నుండఁగలము? ఇప్పటి మీ బిడ్డలు భావికాల పౌరులు. వారి ప్రవర్తన చక్కఁగా నుండకపోయిన దేశము పరాధీనమగుట తప్పదు. ప్రజాస్వామ్యవాది వారికి, దుర్బుద్ధులు, దురూహలు కల్పింపరాదు. ప్రభుత్వమునకుఁ బ్రజలకు కానితనము కల్పించినాఁడు. అతని బోధ నాలింపకుఁడు. ఇంతవఱకు నాలించినది మఱచిపొండు. మీరు దేశమునకుఁ జేయవలసినది చాలఁగలదు. మీలో సత్యాసత్య విచారణశక్తి సన్నగిల్లుటచే నాతని మాయా వాదనకు లొంగినారు. ఇఁక లొంగకుడు" అని బల్లగుద్ది దీర్ఘముగా నుపన్యసించెను.

ఏథెన్సు నగరములో దైవారాధన నిరసించినాఁడని, యువకులను చెడఁగొట్టినాఁడని నేరములు సోక్రటీసుపై మోపఁబడినవి. ఒకానొక వ్యక్తి తాను చేయుచున్న వృత్తినివదలి మఱొకవృత్తి నవలంబింపఁగా, నట్లనలంబించుట సోక్రటీసు బోధనా ఫలితమేనని మఱొక నేర మాతనిపై మోపఁబడినది.

ఇట్టి నేరములు మఱికొన్ని నమోదుపఱచి, యభియోగమునుమోపి, పెద్దలమనుకొను వ్యక్తులు కొందఱాతనిని న్యాయసభకీడ్పింప నుద్యమించిరి. వీథ వీథులలో నీయభియోగమునుగూర్చి యే ప్రజలు కథలట్లు చెప్పికొనసాగిరి. ఏథెన్సు నగర భవిష్యత్తెట్లు తేలఁగలదోయని మఱికొంద ఱనుకొనుచుండిరి.

కాని, యెవ్వరేమనుకొన్నను నెందఱెన్ని యభియోగములు తెచ్చిపెట్టినను, సోక్రటీసు చలింపక యేకదీక్షతో యథాప్రకారము వీథులలో దిరుగుచు నుపన్యసించుచుండెను. అభియోగమునకెట్టి సమాధానమీయవలయునో యనికూడ సోక్రటీసించుక తలంప లేదు. ఒక వేళ సమాధాన మొసంగవలసివచ్చినపుడు తన పవిత్ర జీవితము, తన ప్రజాసేవ సమాధానములగునని విశ్వసించియుండెను.

ఒకనాఁడు సోక్రటీసు ధ్యానసమాధిలోఁ గూర్చుండి యంతరాత్మనుద్దేశించి "జనులకుఁ గలుగుచున్న యాపదలు వారింప నా జీవితము నంకితము చేసితిని. స్వార్థముత్యజించితిని. లోకనిందకుఁ బాత్రుఁడనైతిని. సత్యమును విడనాఁడను.

కార్యాచరణ మానను. ఎప్పుడు నా సంకల్పము నెరవేరునో యప్పుడే నా భౌతిక జీవితము చాలించెదను. ఇది యాత్మ నిశ్చయము నా నమ్మకము. ప్రజాసేవకుఁ గొఱగాని నా జీవితము తుచ్ఛమైన నిచ్చుటనుండుట కంగీకరింపను. ఒక వేళ నా సమక్షమున బ్రజలు నన్ను దూలనాడినను. నేబోయినపిదపనైన నన్నుఁ గొనియాడఁగలరు. నా కంతియేచాలు'' నని విపులముగా బలికెను.

ఆతని మనోనిశ్చయమునకు, కార్యదీక్షకు, బ్రజాసేవకుఁ బంచభూతములంగీకరించినవి. ఆతఁడంతరాత్మను గూర్చి పలికిన పలుకులకు దిక్తటములూ కొట్టినవి. ప్రకృతిచే నంగీకారమందినవానికి, ప్రజాంగీకారమనవసరము కదా! మూఁకుఁడు లేని లోకమెట్లు వాపోయినను బోవచ్చును. ధర్మాత్మునకాతని మనసే ప్రబలసాక్ష్యము కదా!

సోక్రటీసుపై నిరూపింపఁబడిన యభియోగమును విచారింప న్యాయస్థానమేర్పడినది. న్యాయమూర్తులు సంసిద్ధులైయుండిరి. మొదట వాదులు తాము మోపిన నేరమునుగూర్చి న్యాయస్థానమున విశదీకరించిరి. ఆ తరువాత ప్రతివాది వారి వాదనను ఖండించుచు సమర్థించుకొనుట కవకాశమీయఁబడినది.

ఏ గాలి కాచాపయెత్తుట, కల్లమాటలతో నేరమును గప్పి పుచ్చి తప్పించుకొనుట మున్నగు ప్రవర్తనలు సోక్రటీసునకు గిట్టనివి. కనుక, న్యాయసభలో నాతఁడు ఘంటాపథముగా నెలుఁగెత్తి ''ఏథెన్సు నగరపాలన మధోగతి

పాలైనది. ప్రజలమాయకులు. వారికి రాఁబోవు కష్టముల గుర్తింపఁజాలరైరి. వారికి నైతికముగా బలము సేకూర్చుట నా విధియని తలంచితిని. ఈ కార్యాచరణకై నన్నీశ్వరుఁడు సృజించినాఁడని నా నమ్మకము. నా ప్రబోధమువలన యువకులు చెడుటకుబదులు సన్మార్గగాములైరి. వారి భావి కర్తవ్యము నిర్ణయించుటకు నా ప్రబోధము వారికి మార్గదర్శకమైనది. నాపైఁ దెచ్చిన యభియోగము ధర్మవిరుద్ధమైనది. భగవదాదేశమునకుఁ బాత్రుఁడను. ఇఁక మీరెట్టి తీర్పొసంగినను దలఁదాల్చెద" నని యూరకుండెను.

సభలో కలకలము రేఁగినది. కొంతవడికి బ్రశాంతమైనది. అప్పుడు సభ్యులలో గొందఱు "సోక్రటీసు దొమ్మ పొగరువాఁడ" నిరి. మఱికొందఱు "ఆతఁడు మహా గర్వి" యనిరి. ఇట్లు పలువురు పలువిధముల నాడిరి.

న్యాయమూర్తులలోఁ గొందఱీ విషయమును సభాభిప్రాయమునకు "ఓటు" నకుఁ బెట్టుట సమంజసమని సూచించిరి. వారి సూచనప్రకార మీ యంశము వోటునకుఁ బెట్టఁబడినది. అందు సోక్రటీసున కనుకూలముగా దక్కువ వోట్లును, బ్రతికూలముగా నెక్కువ వోట్లును వచ్చినవి. అందుచే నాతఁడు దోషియని నిరూపణమైనది.

సోక్రటీసు దోషియని నిర్ధారణచేయఁబడినది కాని, యెట్టి శిక్ష విధింపవలయునని తీర్మానింపఁబడలేదు. అప్పుడు సోక్రటీసు న్యాయాధీశులకభిముఖుఁడై "అయ్యలారా!

మీ రెట్టి శిక్ష విధించిన నందులకు నేను బాధ్యుఁడను. అట్టి దానిని ప్రభుత్వమే నిర్ణయింపవలయును. నా శిక్షకుఁ బ్రభుత్వమే బాధ్యతవహింపవలయును. అట్లుగాక నాకు జరీమాన విధించినచో నాహితులా ధనమును జెల్లింపఁగలరు. లేదా! నా కాజన్మాంత కారాగార శిక్ష విధించితిరా! నేనందులకు సంసిద్ధుఁడనే'' యని పలికెను.

ఆ వాక్యములలో నిర్లక్ష్యభావము న్యాయమూర్తుల కెఱుకపడినది. అందుచే వారు కోపోదగ్రులై సోక్రటీసునకు మరణదండన విధించిరి. అప్పుడు న్యాయస్థానమునందు గొంత చీకఁటి, మఱికొంత వెలుఁగు దోచినది.

సోక్రటీసు నిర్భయముగా న్యాయమూర్తుల నుద్దేశించి ''అయ్యలారా! మరణదండనకై యిసుమంతజడియను. మానవుఁడు మరణము నెప్పుడైనఁ గోరదగినదే! మరణమనఁ బరలోకయాత్రయే. దానికై వగవఁబనిలేదు. ప్రపంచమున నాచే జరుగవలసిన ప్రజాసేవ ముగిసినదని తలంచెదను. ఇదియు భగవదాదేశమని నా నమ్మకము.'' అని మిన్నకుండెను.

సోక్రటీసునకు మరణశిక్ష విధించిన తరువాత నాతఁడు కొన్ని దినములు కారాగారమం దుండవలసినట్లు నిర్ణయింపఁబడినది. అతఁడు చెఱసాలలో నున్నంతకాల మాతని శిష్యులు, సానుభూతిపరులు ప్రతిదినము దర్శనార్థము వచ్చిపోవుచుండిరి. ఎన్నికష్టములు వచ్చినను సోక్రటీసు చలించుట లేదని వారు గ్రహించిరి.

ఒకనాఁడు ప్రాతఃకాలమున నాతని మిత్రుఁడగు క్రీటో చెఱసాలకడకే తెంచెను. ప్రజాసేవకునకుఁ గలిగిన దురవస్థకుఁ జింతిల్లినాఁడు. క్రీటో రహస్యముగా సోక్రటీసుతో "హితుఁడా! నీ వీ యాతనఁ బడుటకంటె, తప్పించుకొనుట యుత్తమము. నిన్ను విడుదలఁ జేయుటకు మిత్రులు సంసిద్ధముగా నున్నారు. అందుకు వలయు ధనరాసులు వ్యయింప సమర్థులై యున్నారు. నా హితవాలింపుము. లేదేని దుర్మార్గుల చేతులలోఁ బడవలసివచ్చును. భార్యాపుత్రులు దుర్గతిపాలగుదురు. ఇట్టి సదవకాశము మఱొకసారి రాఁబోదు." అని హృదయము ముట్టఁ బలికెను.

కాని, సోక్రటీసునకు హితుఁ డాచరించిన యుపదేశము పథ్యము కాకపోయినది. ఆతనిని మోమువంక తేరిపాఱఁ జూచి "క్రీటో! నీ మైత్రి కొనియాడఁ దగినది. కాని, తప్పించుకొనిపోవుట ధర్మము కాదు. జీవితమున సంఘటిల్లు విపత్తు లాతని శ్రేయోభివృద్ధికే కారణములు. నా మరణము వలన దేశమున బరివర్తన కలుగఁగలదు. అట్టి మార్పును నేను జూడఁ జాలక పోయినను, ప్రజలు సుఖించిన నా యాత్మ శాంతించును. ప్రభుత్వ శాసనమునుధిక్కరింపను. ఇంత వఱకుఁ జట్టముల ననుసరించియే జీవితమును గడిపితిని. శాసనములకు భీతిల్లి, ప్రాణమును రక్షించుకొనవలసిన యగత్యము నాకుఁ గనఁబడుట లేదు. నా రాకకై స్వర్గసీమ యెదురు చూచుచున్నది. నీ హిత మీసమయమున బాటింప లేదని నా పైఁ గోపింపవలదు." అని సానునయముగా దెలిపెను.

ఆ మఱునాఁ డుదయమున మఱికొందఱు మిత్రులు చెఱసాలకడ కేతెంచిరి. వారివెంట సోక్రటీసు భార్యా పుత్రు లరుదెంచిరి. ఆతనిభార్య లాతనిని జూచి నంతనే పెద్దపెట్టున నేడువసాగిరి. వారి రోదన ధ్వనికి దిక్కులు మాఱు మ్రోఁగినవి. ప్రకృతి కొంతవఱకుఁ జలించినది.

సోక్రటీసు తన యిల్లాండ్రను జూచి, వారిని గృహ మునకుఁ బంపుఁడని మిత్రుల నాదేశించెను. వారు స్త్రీలను వెంటఁ బెట్టుకొని బలవంతముగా నింటికిఁ జేర్చిరి. క్రమముగా నందఱు కారాగారమును వీడిరి. క్రీటో మాత్ర మచ్చటనే యుండెను.

అది సాయంకాలము. సూర్యుఁ డుదయము నుండి, నిజప్రతాపమును జూపి, విశ్రాంతికై చరమగిరికిఁ బోవు చుండెను. సంజకెంజాయలు దిక్కుల నావరించుచుండెను. సోక్రటీసు స్నానమాచరించుటకై లేచినాఁడు. కొలఁది కాలములో స్నానమాచరించి, దుస్తులు ధరించి, మనసార దేవుని బ్రార్థించినాఁడు. ఆ తరువాత మిత్రు లిరువురు సంభా షించినారు.

అప్పుడొక సేవకుఁడు వచ్చి "మహాశయుఁడు విషము త్రాగవలసినకాల మాసన్నమైనది." అని హీన స్వరమున బలికి, కన్నీరు కార్చెను. అతనిమాటలు వినగానే క్రీటో గుండె గుభేలుమన్నది. సోక్రటీసు చిఱునవ్వుతో "చెలికాఁడా! ఏమిచేయుటకైన నేను సంసిద్ధుఁడనే! కాని దుఃఖమునకుఁ గారణము; ఇంతకు ముందు నన్ను పరామర్శించి

పోవు వాఁడవు కదా! నే డేల యీ విచారము" అని పలికెను.

సే :—అయ్యా! ఇంకఁ గొన్ని నిమిషములున్నవి.

సో :—ఆలస్యమునకుఁ గారణము. విషపానమునకు గాలనియమము కలదా?

సేవకుఁడు భయకంపనమున విషపాత్రను సోక్రటీసున కిచ్చెను. అప్పుడు "మిత్రమా? దీనిలోఁ గొంత దేవున కర్పించి, తక్కినది త్రాగవచ్చునా" యని పలుకుచు, పాత్ర నెత్తికొని యందలి విషమును గటగట త్రాగెను. క్రీటో నిర్విణ్ణుఁడై చూచుచుండెను.

కొంతకాలము సోక్రటీసు మహోల్లాముగా నటు నిటు తిరిగెను. ఆతని పాదములు బరువెక్కఁగా నొకచోట గూర్చుండెను.

బాల్యమునుండియు నేఁటివఱకు ప్రజాసేవఁ గావించి, శరీర ప్రాణములు దేశమున కర్పించిన సోక్రటీసు కన్ను మూసెను. ఆతని యాత్మ శాంతించుఁ గాక!

# ౫. సాంఘిక విప్లవము

ఒక దేశమందు ప్రజానీకము సాంఘిక దౌర్బల్యమున క్రుంగిపోయినపు డా దేశమున విప్లవములు చెలరేగుట సహజము. అప్పటి దేశపరిస్థితుల కనుగుణ్యముగా సంఘ సంస్కరణ జరిగించుటకు విప్లవనాయకు లుద్భవింతురు. అట్టివారిలో రామమోహానరాయ లొక విప్లవ వీరుఁడు.

క్రీ. శ. పదియేఁడవ శతాబ్దమునం దుత్తర హిందూస్థానమును బాలించిన తురుష్క ప్రభువులు, హిందువులను, ముసల్మానులను సమానముగా గౌరవించిరి. వారి కొలువులో హిందువులకు గూడ గొప్ప యుద్యోగము లిచ్చి గౌరవించిరి. జాగీరు లొసంగిరి. వారి విజ్ఞాన నైపుణ్యమునకు, ధైర్య సాహసములకు మెచ్చి, బిరుదములు కూడ ప్రసాదించిరి.

అట్టి హిందువులలో వంగదేశీయులు కీర్తిఁగన్న వారు. వారికి ఘాదరీ-రాయ్-అను బిరుదములు వంశానుగుణ్యముగా లభ్యమైనవి. రాయ్ వంశస్థులు వంగ బ్రాహ్మణులు. శాంతమూర్తులు. ధర్మపరులు. ఆచారములను జక్కఁగా బాటించెడువారు.

ఈ వంశములో బ్రధానుఁడు వ్రజవినోదుఁడు. అతని కేడుగురు పుత్రులు. వారిలో నైదవవాఁడు రమాకాంతుఁడు. వారిది వైష్ణవకుటుంబము.

వంగ దేశమండలి రాధానగర మాతని నివాసస్థానము. రమాకాంతరాయ్ యుక్తవయస్సు రాగానే తారుణీదేవిని వివాహమాడెను. ఆమె వైదిక బ్రాహ్మణుని యింటిబిడ్డ. ఆ కాలమున వైష్ణవులు వైదికులతో సంబంధములు చేయుట యాచారవిరుద్ధముగా నెంతురు. కాని, రమాకాంతుఁ డిట్టి సంబంధము చేసికొన్నను, కులసాంప్రదాయములకు భిన్నముగా ప్రవర్తింపలేదు. దంపతు లిరువురు కలిసి మెలిసి వర్తించుచుండిరి.

ఈ దంపతుల కిరువురు పుత్రులు, నొక పుత్రిక గలిగిరి. వారిలోఁ గడపటివాఁడు, రామమోహనుఁడు క్రీ. శ. 1772 సం॥ మే 22-వ తేది జన్మించెను. ఆతని జన్మవలన రాయ్ వంశము మన దేశమున సాఁటిలేని దనిపించుకొనెను. ఈతఁడే విప్లవ వీరుఁడై భారత విజ్ఞానజ్యోతిని ఖండాంతరము లందు వెలిగించినాఁడు.

రామమోహనుఁడు జమీందారుని యింట జన్మించిన వాఁడగుటచే నల్లారుముద్దుగా బెరుగుచుండెను. ఈతని శైశవము చాలవఱకు మాతామహునియింట గడచిపోయెను. ఇందులకుఁ గారణము తాతగారి కీ బాలునిపైఁ గల ప్రేమయే.

రామమోహనున కైదవయేఁడు వచ్చినది. అప్పుడు వైభవముగా నక్షరాభ్యాసము చేయఁబడెను. బాల్యము నుండియే రామమోహనునకు గ్రహణశక్తి, మేధాసంపత్తి, ఆలోచనాశక్తి మొదలైనవి వృద్ధియయ్యెను.

ఈతఁడొక పాఠము నొకసారి వల్లించిన యెన్నటికి మఱచిపోని యపూర్వ మేధానిధి యయ్యెను. ఆ నాఁటి ప్రాథమిక విద్యావిషయ మాతనికిఁ గరతలామలకమైనది. ఈ ప్రతిభ కందఱు విస్మయమందఁ జొచ్చిరి. రామ మోహనుఁడు మొదట మాతృభాషయగు బంగాళీ భాషను నేర్చుకొన్నాఁడు.

ఆ కాలమందు పారసీభాష రాజభాష. తొమ్మిదేండ్ల ప్రాయమప్పుడాతఁడు పారసీభాషను నేర్చుకొనుటకై పాట్నానగరమున కంపఁబడినాఁడు. రెండు సంవత్సరము లలో నా భాషను సమగ్రముగా నేర్చుకొనెను. కాలక్రమ మున మాతృరాజభాషలలో రామమోహనుఁ డెన్నఁదగిన పాండిత్యము గడించెను.

ఆతనికి సంస్కృతఁ మభ్యసింప మనసుగలిగెను. అభిలాషయున్నచో నేభాషనైన విద్యార్థులు గడింపఁ గలరు. కావున సంస్కృత మభ్యసించుటకై కాశీనగరమున కేగెను. కాని యచ్చట బాలున కాప్తులెవరు లేకపోవుటచే నొంటిరిగానుంచుటకు రమాకాంతున కిష్టము లేకపోయెను. అందుచే నొక పండితుని రప్పించి, యింటనే సంస్కృత విద్యార్జనము చేయించెను.

రామమోహనునకుఁ బదియవ యేట వివాహము జరిగెను. అది బొమ్మలపెండ్లివలె నుండెను. కాని వివాహమై పూర్తిగా నొక వత్సరము నిండకముందే యాతనికి భార్యావియోగము గలిగెను. రమాకాంతుఁడు

మఱల తగిన సంబంధమును విచారించి, పునర్వివాహము గావించినాఁడు. ముక్కుపచ్చలారని ముద్దు బిడ్డఁడు రామమోహనుఁడు. ఆతనికిఁ బదియేండ్ల ప్రాయమప్పుడు పత్నీవియోగము, పునర్వివాహము. ఇట్టి సంఘటన లానాఁటి సాంప్రదాయములు. ఈ సాంప్రదాయములను జూచుటచే రామమోహనుని మనస్సు చివుక్కుమన్నది. అప్పుడే యాతని హృదయక్షేత్రమున విప్లవబీజము లంకురింపఁ బ్రారంభించినవి.

కళత్ర వియోగమువలన నాతని విద్యాభ్యాసమున కాటంకము కలుగలేదు. నిరంతర కృషితో నాతఁడు విద్యావ్యాసంగము సేయుచుండెను. బెంగాలి – పారశీక – సంస్కృత గ్రంథములు చదువుటచేత నందలి యాచార విధానములు, దైవారాధనపద్ధతు లాతని కవగతములు కాఁజొచ్చెను. అన్నిటికంటె హిందూమతమునందే మూఢ విశ్వాసములు నిండియున్నవని యాతఁడు గ్రహించెను. అప్పటినుండి రామమోహనునకు విగ్రహారాధన గిట్టకుండెను. ఏకేశ్వరారాధనపై నాతని మనసు లగ్నమైనది. అది మొదలుగా హిందూ సంఘమును మందలింపవలెనని సంకల్పించుకొనెను. సంఘదురాచారములను భారతభూమి నుండి పాఱఁదోలుటకై నిరంతర మాలోచించుచుండెను.

ఆతని హృదయమునందుఁ బీఁటపెట్టుకొనియున్న సంకల్పములకు విస్తార సంస్కృత పరిచయము దోహద మొనరించునని గ్రహించెను. అందుచే మూఁడేండ్లపాటు

నిరంతర కృషిచేసి సంస్కృతభాష గడించెను. ఇప్పటికి రామమోహానునకుఁ బదునైదు వత్సరములు నిండినవి. సంస్కృతమందుఁ గూలంకష సాహిత్య మేర్పడినది. ఆ నాఁటి గీర్వాణభాషా పండితులతో వాదోపవాదములు సెలుప, సామగ్రి సమకూర్చుకొన్నాఁడు.

రామమోహానునకుఁ బదునాఱవ యేడు తలచూపఁ గనే యుపనిషత్తుల సారాంశమును గ్రహించెను. అతని సాహితీ పటిమకు సంస్కృత పండితులు చాలశైరి. అప్పుడు విగ్రహారాధన చేయగూడదని బెంగాలీభాషలో నొక వచన గ్రంథమును వ్రాసి, ప్రకటించెను.

ఇప్పటికి దనయందున్న విప్లవబీజము మొలకెత్తి, యాకులు, రెమ్మలు తోడుగ నారంభించినది. విగ్రహారాధన మహర్షుల సిద్ధాంతములకు విరుద్ధమని సప్రమాణముగా దన గ్రంథమున నిరూపించుటయేగాక, బహిరంగముగా నుపన్యసింపఁదొడఁగెను. వైదిక మతాచారములందలి మూఢ విశ్వాసములను విశదీకరించి, ఖండించెను. ఏకేశ్వరోపాసన సేయుఁడని జనులకు ప్రబోధించెను. తన ప్రబోధనాంశములను నాఁటి దేశీయ పత్రికలందుఁ బ్రచురింప జేసెను.

ఆ నాఁటి దేశభాషా పండితులకందఱుకు రామమోహానుఁడు కంటకుఁడుగా నుండెను. రాయ్ వంశమందుఁ జెడఁబుట్టినాఁడని తూలనాడఁజొచ్చిరి. వివిధ భాషలు నేర్చుకొన్నందుల కిది ఫలమని మఱికొందఱు ద్వేషించిరి.

ఏ వీధిలో నలువురుచేరినను రామమోహనునిగూర్చియు, వాతని గ్రంథమునుగూర్చియు ముచ్చటించసాగిరి.

రమాకాంతునకుఁ గుమారుని ప్రవర్తన నచ్చకుండెను. పెక్కు పర్యాయములు కుమారుని మందలించెను, కాని యుపయోగము లేకపోయినది. తల్లియు బుద్ధి మార్చుకొమ్మని బ్రతిమాలినది. గృహములో నిట్లుండఁగా వంగదేశమం దాతనికి విరోధి సంఖ్య హెచ్చినది. ఐనను రామమోహనుఁడు చలింపలేదు. అభిప్రాయమును మార్చుకొనలేదు.

విశ్వప్రయత్న మొనరించియుఁ గుమారుని సన్మార్గగామిగా నొనరింపఁజాలనందులకు రమాకాంతునకు విసుఁగుఁ డలహెచ్చినది. నగరవాసులు గుఱియించునేటు పోటు మాటలను సహింపలేఁడు. కన్నకడుపని యూరకుండెను లేడు. "ముందేగిన నుయ్యి వెనుకకేగిన గొయ్యి" యన్నట్లయినది రమాకాంతుని స్థితి.

కొంతకాల మెట్లో సహించియుండెను. కుమారుని యెడ మార్పుకలుగలేదు. అందుచే రమాకాంతుఁడు నిర్దాక్షిణ్యముగా గృహమునుండి వెడలఁగొట్టెను. రామమోహనుఁడు తండ్రి యాదేశమును గాదనలేక పోయెను. తన భావిదశనుగూర్చి విచారింపనులేదు. అప్పటికి రామమోహనునకుఁ బదాఱేండ్లు నిండినవి.

కలవారింటఁ బుట్టి, యెన్నఁదగిన వివిధ భాషలను తూర్ణముగా నేర్చి, గారాబముగా బెరిగినవాఁడు. స్వాతంత్ర

జీవితమున కలవాఁటుపడనివాఁడు. తండ్రి యాజ్ఞ మేరకు గృహత్యాగము చేసినాఁడు. ఆ కాలములో ప్రయాణ సౌకర్యములు లేవు. అట్టిచో గాలినడకను హిందూ దేశమున జాలచోట్లఁ దిరిగెను. తుదకు హిమాలయములు దాటి టిబెట్టును జేరెను.

టిబెట్టునకు లాసానగర మాకాలమందు రాజధాని. అందు రామమోహనుఁడు నివాసమేర్పఱచుకొనెను. క్రమముగా నచ్చట యురేనియన్ పాళీభాషలను నేర్చుకొనెను. బౌద్ధమత గ్రంథములు సదివి, యందలి మూల సిద్ధాంతములను, రహస్యములను పుడిసిలించెను. ఆ దేశవాసులందున్న దురాచారములను గ్రహించెను. బహిరంగముగా ఖండించి, బౌద్ధులకుఁ జూపెను.

బౌద్ధమత గురువులను లామా లందురు. వారితో రామమోహనుఁడు వాదోపవాదములు గావించెను. వారీతని విమర్శనలను గొంతకాలము సహించిరి. కాని, యితఁడు సమక్ష విమర్శనలు సేయుచుండుటచేఁ దాళఁజాలక వారీతనిని హత్య గావింపఁజూచిరి. ముఖ్యముగా నా కాలమున టిబెట్టు దేశములో స్త్రీ బహు భర్తలను గలిగియుండుట యాచారమైయుండెను. ఈ దురాచారమును ఖండించినాఁడని మతగురువు లీతనిపైఁ గినిసిరి.

రామమోహనుఁడు హత్యగావింపఁబడ నున్నాఁడని బిడ్డలఁగన్నతల్లి యొక్క_ర్తు గ్రహించినది. ఆమె సాహసించి యెట్లో యితరుల కంటఁబడకుండ రామమోహనుని

దాటించినది. ఈ విషయ మాతఁడు గ్రహించినాఁడు. అది మొదలు లాతఁడు స్త్రీల కష్టములు గట్టెక్కింపఁ గంకణము గట్టుకొనెను. ఇదియే యతని భావి కార్యక్రమమునకుఁ బ్రాతిపదికమైనది.

ఇంతలో రమాకాంత రాయలు పరలోకగతుఁ డయ్యెను. కన్నకడుపగుటచేఁ దారుదేవి కుమారుని బిలిపించెను. తండ్రి మరణానంతరము రామమోహనుఁ డింటిలో స్తిమితముగాఁ గొంతగాలముండుటకు నిర్ణయించుకొనెను. తన సంకల్పము తారుమారుగా సంఘటనలు పొడసూపెను. తండ్రి మరణానంతరము పిత్రీయమైనయాస్తి, రామమోహనునకు సంక్రమింపరాదని నగరమందలి యీర్ష్యాళువులైన పండితులు వాదించిరి. అంతతో వారాగక, తల్లికి బోధ గావించిరి. ఆమె వారి బోధనలు త్రోసి రాజనలేకపోయినది. తత్ఫలితముగా వారామెచేత, భర్తయాస్తి కంతటి కామెయే వారసురాలని న్యాయస్థానమున దావా వేయించిరి.

ఈ కారణముచేతఁ దల్లికొడుకులు ప్రబలవిరోధులైరి. కాని, తానును జ్ఞానసంపన్నుఁ డగుట చేతను, హిందూ ధర్మశాస్త్రములను గాలించిన వాఁడగుటచేతను దానే హక్కుదారుఁడని న్యాయస్థానమున ఋజువుచేసెను. న్యాయమూర్తు లాతని ఋజువును బలపఱచి యాతని పక్షముననే తీర్పుచేసిరి. తనపంతము నెగ్గించుకొన్నాఁడు. తల్లికిబోధించిన పండితులను దృణీకరించినాఁడు. అందుచే దనకుఁ ధర్మముగా

సంక్రమించిన యాస్థినంతయుఁ దల్లిపరము గావించినాఁడు. ఇప్పుడు తనకుఁ దల్లిపైఁగల ప్రేమవెల్లడియైనది. అతఁడు కార్యశూరుఁ డని తెల్లమైనది.

రామమోహనుఁ డింటిలో నున్నంత కాల మాంగ్ల భాషను స్వయముగా నేర్చుకొన నారంభించెను. కొలఁది కాలములోనే యింగ్లీషు వ్రాయుటకుఁ జదువుటకు నేర్చుకొనెను. అతఁడేక సంధాగ్రాహియని పలువురు ప్రశంసించిరి. అతని యసాధారణ మేధా సంపత్తికి దేశీయులు, హర్షించి, గౌరవింపక పోయినను, విదేశీయు లాతని ప్రజ్ఞా విశేషమునకుఁ గై మోడ్పు లర్పించి, గౌరవించిరి. అతని కీర్తి ఖండాంతరముల వ్యాపింపఁ జొచ్చెను. ఇట్టి యమూల్యాలంకారము వంగదేశమున జనించుట దేశము ధన్యమైనదని యథార్థవాదులు కొనియాడిరి.

ఇట్లెంత కాల మింటిలో నికామిగా నుండఁగలఁడు? ఏదైన ప్రభుత్వోద్యోగమునందుఁ బ్రవేశించిన యుత్తమమని గ్రహించినాఁడు. క్రీ. శ. 1800 వ- సంవత్సరమున రంగపురమున జిల్లా కలెక్టరుగానున్న "డిగ్బీ" దొర కొక యర్జీ వ్రాసి పంపుకొనెను. ఇంతకుముందే కలెక్టరీతని ప్రతిభా విశేషములను గ్రహించినవాఁడుగాననే చిన్న గుమాస్తా యుద్యోగమిచ్చెను.

క్రమక్రమముగా రామమోహనుఁ డున్నతాధికారుల మన్ననలకుఁ బాత్రుఁడైనాఁడు. ఆ మఱుసటి సంవత్సరమే జిల్లా శిరస్తదారుగా నియమింపఁ బడెను.

గర్వింపక, తన క్రింది యుద్యోగులను మన్నన జేయుచుండి, వారి యభిమానమునకుఁ బాత్రుఁ డయ్యెను.

గుమాస్తాలలోఁ బెచ్చు పెరిగియున్న లంచగొండి తనమును మొదలంట తుడిచివేసెను. ప్రజల యిబ్బందులను గుర్తించి, ప్రభుత్వమున కెఱుకపఱచి, పోరాడి వారికి సాయపడెను. పన్నులభారము చాలవఱకుఁ దొలఁగించెను. వ్యవసాయదారులకు పలయు సౌకర్యములు కలిగించెను.

ప్రభుత్వ మాతని కార్యదక్షతను గుర్తించినది. వెంటనే ప్రభుత్వ మాతనికి దివానుపదవి ననుగ్రహించి, గౌరవించినది. ఆ కాలమున దివానుగిరిని మించినపదవి, మఱేది లేదని ప్రతీతియుండెడిది.

దివాను పదవిలోనున్న దాఁదాపు ద్వాదశవర్షములు రాజకీయ కార్యములమీఁద వంగదేశము నంతయుఁ బర్యటించెను. అందందుఁగల జనులస్థితిగతులనుగ్రహించెను. ఇట్లు న్యాయదృష్టితోఁ బ్రభుత్వోద్యోగమును నిర్వహించి, తన సంకల్పమగు ప్రజాసేవకు జాలినంత యవకాశము లేదని గ్రహించి, తన పదవిని వదలుకొనెను.

ఆ తరువాత రామమోహనుఁడు కలకత్తానగరములో స్థిరముగా గొంతకాలము నివసింపఁ దొడఁగెను. అచ్చట తన కసంఖ్యాకులు మిత్రులైరి. వారితో ననుదినము తన కార్యక్రమమునుగూర్చి గోష్ఠి సలుపుచుండెను. క్రమ క్రమముగా దనపక్ష మవలంబించినవారు సంఘముగా

నేర్పడిరి. వారందఱి సహాయముతో నతఁడు "బ్రహ్మ సమాజము"ను స్థాపించెను.

ఈ సమాజము స్వదేశీయులనే గాక, విదేశీయులను గూడ బెక్కుమంది నాకర్షించినది. ఈ సమాజమునుగూర్చి, యింగ్లాండు, అమెరికా మొదలైన దేశపత్రికలు ప్రశంసించినవి. బ్రహ్మసమాజము బలపడినది. అప్పటినుండి రామమోహనుఁడు సంఘ సంస్కరణల కుపక్రమించెను.

ఆ కాలమున బంగాళాదేశమున శాక్తేయ మతము ప్రబలియుండెను. శాక్తేయులకును, వైష్ణవులకు తఱచు మతవాదములు జరుగుచుండెడివి. అందుచే నరబలులు, శిశుహత్యలు విపరీతముగా, జరుగుచుండెడివి. వీనికిఁదోడు నమానుషమగు సహగమన దురాచారము దేశమునందు నాలుగుమూలలఁ దాండవించుచుండెను. భర్తృ వియోగముచే సతీమతల్లులు మనఃపూర్వకముగా భర్తతోఁబాటు చితి పైకెక్కి భస్మమగుచుండిరి. కాని, కొందఱిని బలవంతముగా నవయవములు బంధించి, నిప్పులపైఁ బడవేసి, నిండు ప్రాణములు తీయుచుండిరి.

ఈ విధముగా బదేండ్లలోఁ దాఁదాపు నాలుగువేల మందికిఁ బైగా స్త్రీలీ ఘోరమరణము వాతఁబడిరి. అతి క్రూరము, నమానుషము, దురాచారము నగు నీ సహగమనమును రూపుమాపుటకై రామమోహనుఁడు పాటు పడఁజొచ్చెను.

భారతస్త్రీలకు వాటిల్లుచుండిన దురంతములం బాపుం డని ప్రభుత్వము వారికి మహాజర్లు పంపెను. సహగమనము నిషేధింపుండని కారణములుచూపించి, చిన్న గ్రంథము వ్రాసి, ప్రకటించెను. గ్రామ గ్రామములు తిరిగి యుపన్యాసములు గావించెను. పండితులతో వాదోపవాదములు చేసి, ఖండించెను. వంగదేశమున గొందఱు రామమోహనుని పక్షమవలంభించిరి. మఱికొందఱు విరోధించిరి. పూర్వాచార పరాయణులగు పండితు లందందు సభలు చేసి, రామమోహనుని వాదమును ఖండించిరి. అనాది నుండియు భారత దేశమున నడచుచుండిన సహగమన సనాతన ధర్మము లేకపోయిన, హిందూ మత మడుగంటునని ప్రజలకు బోధించిరి.

ఆకాలమున ఇండియా గవర్నరు జనరలుగానుండిన లార్డు హేస్టింగ్సు ప్రభువుతో సంప్రదించి, సంఘసంస్కరణల కొరకు చట్టము గావింపుండని రామమోహనుండు కోరెను. గవర్నరు జనరలు విషయమును విశదముగా గ్రహించి ప్రయత్నించెదనని చెప్పెను. కాని, మత విషయములలో జోక్యము గలిగించుకొనుట కాతండు సాహసింపలేక పోయెను.

ఇంతలో లార్డు హేస్టింగ్సు స్వదేశమునకు వెళ్లుటయు వారి స్థానమున లార్డు బెంటిక్ ప్రభువు వచ్చుటయుం దటస్థించెను. ఆయనతో బరిచయము చేసికొని, రామమోహనుండు సహగమన దురాచార నిషేధమునకు

శాసనము గావింపు(డని గట్టిగా( బట్టు(బట్టెను. బెంటిక్ ప్రభువు విషయమును గ్రహించి, రామమోహనుని కారణములు యుక్తములని తెలిసి, సాయము చేయుటకు( దోడ్పడెను.

అంతట వెంటనే బెంటిక్ ప్రభువు సహగమన నిషేధమును జట్టరూపమున శాసించెను. ఆనా(టితో స్త్రీ సంఘమునకు( గొంత యుత్తేజము కలిగినది.

రామమోహను(డు సాంఘికముగా నొక విజయము సాధించినా(డు. ఇందుల కాత(డెంతయు సంతసించి, భావి కార్యక్రమమునకు( గడంగెను. ఆకాలమున వంగదేశమున( బుట్టు(బోవు శిశువుల క్షేమమునకై తొలిబిడ్డను గంగపాలుసేయు నలవాటొకటి ప్రబలముగా నుండెను. అట్టి దాని నాత(డు ప్రచారముచేసి రూపుమాపెను. బహుభార్యాత్వము, బాల్యవివాహముల నరికట్టించెను. అంటరానితనము కూడదని ప్రచారము గావించెను.

భారతీయ వేదాంతమును గ్రహించినవా( డగుట చేతను, ఉపనిషత్తులపై విశ్వాసము గలవా(డగుటచేతను, రామమోహను(డు కలకత్తా నగరములో "ఆత్మసభ" యనుపేర నొకసభ నిర్మించెను. అటుతరువాత వేదాధ్యయనము వృద్ధిగావలయునని యందే "వేదమందిరము" అను పాఠశాలను స్థాపించెను. ప్రార్థనాదులు, సమావేశములు జరుగుటకై యొక బ్రహ్మ మందిరమును గట్టించెను. బ్రహ్మసమాజ మతస్థులంద ఱా మందిరమునకు విచ్చేయు

చుండిరి. బైబులు, ఖొరాను, ఉపనిషత్తులు—వీనిలోని సత్యమును, ధర్మమును క్రోడీకరించి, యా మతస్థులను దినము చర్చలు గావించుచుండెడివారు.

మతసిద్ధాంతములు, ఆచరణ విధానములు ప్రజలు గ్రహించుట కనువుగా "కౌముది" అనుపత్రిక స్థాపించెను. వెంటనే రామమోహనుని ప్రతిపక్షములోనివారు "ధర్మ సభ" యనుపేర నొకసభను స్థాపించి, యాతని వాదములను ఖండించుచుండిరి. వారి యాజమాన్యమున "చంద్రిక" యనుపేర నొక పత్రికను స్థాపించిరి. దానిమూలమున వారు తమ సిద్ధాంతములను బ్రజల కందఁజేయు చుండిరి.

రామమోహనుఁడు తన పట్టుదలను నెగ్గించుకొనుటకు ధర్మనిరూపణ జేయుటకు, సంస్కరణలు సేయుటకు స్త్రీ పునర్వివాహము శాస్త్రసమ్మతమని వాదించెను. శాస్త్రదృష్ట్యా తన వాదనను పత్రికా మూలమున బుజువు చేయుచుండెడివాఁడు.

వంగదేశమందా కాలమున "కులీనులు" అనునొక తెగవారుండిరి. వారు మిగుల పవిత్రులుగా నెన్నఁబడుచుండిరి. అందుచే ప్రతివారును పవిత్ర కులీనబ్రహ్మణులతో సంబంధములు సేయుట కువ్విళ్ళూరుచుండెడివారు. తత్ఫలితముగా నొక కులీనబ్రాహ్మణ యువకునకు వరుసగా ముప్పూరు, నలుగురు కన్నెలను, కట్నములతో సమర్పించుచుండెడివారు. ఒకవేళ భర్త మరణించినచో నా ముప్పూరు, నలువు రొక్కసారి వైధవ్య దుఃఖసముద్రమున మునుఁగ

వలసి వచ్చుచుండెను. ఈ దురాచారమునుగూడ, చాల ప్రయాసతో రామమోహనుఁడు రూపుమాపెను.

హిందువుల కూరూర బాఠశాలలు స్థాపింపవలయు ననియు, బ స్త్రీలలోఁ గళాశాల లేర్పాటుచేయవలయుననియు ప్రజాపక్ష మవలంబించి, యానాఁటి గవర్నరు జనరలునకు మహాజర్లు పంపించెను. అట్టి యవసరమును ప్రభుత్వము గుర్తించి, పాఠశాలలను, గళాశాలలను స్థాపించెను.

ఇంతటితో రామమోహనుఁడు వంగదేశమున విద్యాసంబంధముగ, సాంఘికముగా, నైతికముగ, నఖండ విజయములు సాధించెను. తాను బడిన కష్టనష్టములకు ఫలితమనుభవించెనని సంతోషమున బొంగెను. ఆపైఁ దన విజయములనుగుఱించి, భావగంభీరముగా, గొన్ని కృతులను రచించెను. ఈనాఁటివఱకు వంగదేశమునం దా కృతులు ప్రతిధ్వనించుచున్నవి. చాలవఱకు రామమోహనుఁడు తన సంకల్పమున గృతకృత్యుఁడైనాఁడను ప్రతీతి వంగదేవమున ప్రమోఁగిపోయెను.

చాలకాలమునుండి రామమోహనున కింగ్లాండున కేగవలయునని యాలోచనయుండెను. దాని కనుగుణముగా ఢిల్లీ చక్రవర్తి, రామమోహనునకు "రాజా" బిరుద ప్రదానముజేసి, యింగ్లాండునకు రానుపోను ఖర్చులకు ద్రవ్య మిచ్చిపంపెను. వెంటనే యాతఁడు క్రీ. శ. 1830 లో ప్రయాణమై యింగ్లాండు జేరెను.

అచ్చటనుండు దొరలు, నున్నతాధికారులు రామ మోహనున కఖండ స్వాగతమిచ్చిరి. ఇంతకుముందే యాతని కీర్తిచంద్రికలు విదేశములఁ బ్రకాశించుచుండెను. అచ్చట మూఁడు సంవత్సరములుండి యందందుఁ బెక్కు సభలలో భారతీయ సంస్కృతిని గుఱించి గంభీరోపన్యాస ములు గావించెను. అతని వాగమృతమునకు, విషయమున కచ్చటి విద్యావంతు, లితరులు ముగ్ధులైరి. వారిలో జాలమంది యాతనిపక్ష మవలంబించిరి.

భారతీయ ప్రతిభను ఖండాంతరములకుఁ గొనిపోయి వెలిగించిన భారత కుమారరత్నములలో రామమోహనుఁ డొకఁడని ప్రతిష్ఠ వెల్లడియైనది.

ఇట్టి సాంఘిక విప్లవవీరుఁడు, కార్యశూరుఁడునగు రాజా రామమోహనరాయి, బ్రిస్టలు నగరమందు క్రీ. శ. 1833 వ సంవత్సరము సెప్టెంబరు 27-వ తేది రాత్రి కాల గర్భమున నిద్రించెను.

ఇట్టి సాంఘికవీరుని మహదాశయములు, కార్యదీక్ష భారతీయుల కనుదిన మనుసరణీయములేకాక, చిరస్మర ణీయములుగూడ కదా! ఈతఁడు "వీరజ్యోతి"లో నొక కాంతి గుళికగా భాసిల్లుచుండెను.

# ౬. త్యాగము

ఆంధ్ర దేశమున మనుమసిద్ధి పాలనలో విక్రమ సింహపురి వన్నెకెక్కినది. తన ఖడ్గధారచే ప్రభువునకు విజయముగూర్చి, వీరస్వర్గ మలంకరించిన ఖడ్గతిక్కనగారి నివాసస్థానము విక్రమసింహపురి. పదునైదు పర్వము లేకధాటితో మహాభారత మాంధ్రీకరించి, యాంధ్ర దేశమున గవితామృతవర్షము కురియించిన "కవిబ్రహ్మ" తిక్కన గారి కవితా విహారభూమి విక్రమసింహపురి. ప్రస్తుతము "నెల్లూరు" అను నామాంతరమున వెలయుచున్నది.

నెల్లూరు మండలములో జువ్వలదిన్నె కుగ్రామము. అందు "పొట్టి" యింటిపేరిట నార్యవైశ్య కుటుంబముం డెడిది. వారు వ్యాపారమునిమిత్తము చెన్నపురి తాత్కాలిక నివాసముగా నేర్పఱచుకొనిరి.

ఆ కుటుంబమున క్రీ. శ. 1901 లో అణ్ణాపిళ్లై వీధిలో నెం. 163 రు గృహమందొక మగబిడ్డ జనించెను. తల్లిఁ దండ్రు లాబిడ్డకు "శ్రీరాములు" అని నామకరణము చేసిరి. శ్రీరాములు తోడివారితో నాఁడుకొనుచుఁ, గాలక్రమమున బెరిగి పెద్దవాఁడయ్యెను. బాల్యమున ప్రాథమిక విద్య పూర్తి చేసికొని, క్రీ. శ. 1920 సంవత్సరమునకుఁ జెన్నపురి యందే శానిటరీ ఇంజనీరింగు పరీక్షకుఁ జదివి యందుత్తీర్ణుఁ డయ్యెను.

శానిటరీ ఇంజనీరింగు డిప్లొమా పొందిన తరువాత శ్రీరాములు జి. ఐ. పి. రైల్వేలో బొంబాయి నగరమున నెలకు రూ. 250 లు వేతనముమీఁద ఇంజనీరుగా నుద్యోగ వృత్తియందుండెను. ఇట్లు కొంతకాల మావృత్తియందుండఁగా హఠాత్తుగా నాతనికి బత్నీవియోగము సంభవించెను. అంతట సంసారముమీఁద, నుద్యోగముమీఁద విరక్తి కలిగినది.

నైజముగా బాల్యమునుండియు శ్రీరాములు మితభాషి, యాలోచనాపరుఁడు. నిండుకుండ. భార్య గతించుటతోడనే కొంతవఱకు లౌకికసంబంధములు తెగినవని భావించినాఁడు శ్రీరాములు. అప్పుడు తనకున్న యాస్తిపాస్తులు జననీ సోదరుల పరముగావించెను. ఆనాఁటితో నుద్యోగమునకుగూడ స్వస్తిచెప్పి, యొంటరిగా గాలక్షేప మొనరింప సంకల్పించినాఁడు.

ఈ సంకల్పమేమిటో! దీని పర్యవసాన మేమిటో! తనకే తెలియకుండెను.

అవి భారతజాతీయసంస్థ స్వతంత్ర సంపాదనకై బ్రిటిషువారితో బోరాడుచున్న దినములు. ఆసేతు హిమాచలపర్యంత ప్రదేశము గాంధీమహాత్ముని యడుగుజాడలలో నడచుచున్న దినములు. విదేశవస్తు బహిష్కారము, స్వదేశవస్తు ప్రచార మమ్మురముగా సాగుచున్న దినములు, ఊరేగింపులలోఁ బాల్గొని, సభలలోఁ బాల్గొని లాటిదెబ్బలకు గురియై, భారతీయులెందఱో బాధలొందిన దినములు.

అసహాయోద్యమము తీవ్రరూపమున దేశమందు తాండవించుచున్న దినములు.

శ్రీరాములు దేశవిషయముల నొక్కసారి తేరిపారఁ జూచినాఁడు. "భారతీయుఁడవై జన్మించినందులకు నా కర్తవ్యమొకకొంత కలఁదని" భావించినాఁడు. ఎవరో పిలిచినట్లుగా శ్రీరాములు – తన యభిప్రాయమునుగూర్చి సోదరున కొక యుత్తరము వ్రాసి–సబర్మతీ యాశ్రమమునుఁ జేరెను.

అది గాంధీమహాత్ముఁడు కార్యాచరణకై నిర్మించుకొన్న యాశ్రమము. అందు శ్రీరాములు గాంధి శిష్యుఁడై క్రీ. శ. 1939 వఱకు కార్యకలాపములందుఁ బాల్గొనుచుండెను. అచ్చట పెక్కుమంది నాయకులున్నను వారి చేతుల నిండుగా బనియుండెడిది. ఒక్కొక్క శాఖకుఁ గొంతమంది నిశ్చలముగా గార్యకలాపములు సేయుచుండెడివారు.

శ్రీరాములు నిరాడంబరజీవి. తాను జేయు సేవను గుఱించిగాని, త్యాగమును గుఱించిగాని యితరులు వినుటకిచ్చగింపనివాఁడు. తన కప్పగించిన కార్యమును గుట్టుగా జక్కగాఁ నాచరించు కార్యశూరుఁడు. తన యనుచరుల కన్న మిన్నయై బాపూజీ దృష్టిని దనపై కాకర్షింపఁ జేసికొన్నాఁడు.

శ్రీరాముల ప్రవర్తన, కార్యదీక్ష, పట్టుదల మొదలైన సుగుణగణము లొకసారి పరిశీలించి, మహాత్ముఁ

డందఱి సమక్షమున "ఇట్టి దీక్షాపరులు మఱి తొమ్మిది మంది మనకు లభించిన స్వాతంత్ర్యము నొక సంవత్సర కాలములో సంపాదింప వచ్చు" నని ప్రశంసించినాఁడు.

మహాత్ముఁ డంతవాఁడు తన్ను మెచ్చుకొన్నాఁడని శ్రీరాములు గర్వించ లేదు. తనతోడివారిని జులకనగా జూడ లేదు. మునుపటికన్న తన కార్యకలాపములను దీక్షతో నెరవేర్చుచుండెను.

శ్రీరాములు స్వరాజ్యసమరములో మూఁడుసార్లు కారాగార శిక్షఁబొందెను. 1938 లో వ్యక్తిసత్యాగ్రహములో బాల్గొని రాజకోటలోఁ దాఁదాపు రెండు సంవత్సరములు దేశసేవ గావించినాఁడు. పిమ్మట గుజరాతు రాష్ట్రములోనున్న తరవాడ గ్రామసేవా శ్రమజీవి సంఘములో బాల్గొని చెఱసాల శిక్ష యనుభవించినాఁడు. 1943 వ సంవత్సరమున నెల్లూరుజేరి, రాట్నప్రచారము సాగించెను. ఇంటింటికేఁగి రాట్నపరిశ్రమ గావింపుఁడని ప్రచారము సేయసాగెను. భిక్షాటనవృత్తితో సర్వమత సమిష్టిభోజనము సేయుచు, దేశసేవారతి కాలము గడుపుచుండెను. అచ్చట నున్నంతకాలములోఁ జాలభాగము హరిజన దేవాలయ ప్రవేశమునుగుఱించి, తీవ్రముగా నాందోళనఁజేయ సాగినాఁడు. నెల్లూరులో హరిజనులను దేవాలయములోనికి రానీయ లేదని యిరువదియెనిమిది దినములు ప్రాయోపవేశము సాగించినాఁడు. ఈ సంఘటన శ్రీరాముల త్యాగదీక్షకు

ప్రాతిపదికమైనది. తన దేశసేవా నాటకమునకు నాంది ప్రస్తావన సాగించినాఁడు.

తనకోరిక నెరవేఱినంతవఱకు నిరశనవ్రతము గైకొన్నాఁడు. ఈతని కఠోరదీక్షకు బాపూజి యలరి, జయము కాంక్షించి, దీవనలంపినాఁడు.

ఇంతలో భారతీయుల త్యాగదీక్షా ఫలితముగా 1947 లో స్వరాజ్యము ప్రాప్తించినది. కాని, యీ సమయమందైనను హరిజనోద్ధరణ కార్యక్రమము జయప్రదము కాలేదని మఱల, నిరశనవ్రతము సాగించినాఁడు. తత్ఫలితముగా (అప్పుడు) మద్రాసు ప్రభుత్వము జిల్లాకలెక్టరులందఱకు, ప్రతిమాసమున చివఱరోజు హరిజనోద్ధరణ కార్యక్రమమునకు వినియోగింపుఁడని యుత్తరువు జేసినది.

స్వాతంత్రము లభించిన తరువాత మహాత్ముఁ డేర్పఱచిన "సర్వోదయ సిద్ధాంతముల" ననుసరించి, రాజకీయ రంగమునుండి వైదొలఁగి, నిర్మాణ కార్యక్రమమునందు పాల్గొనెను. గాంధేయ సూత్రాల నడుగుదాటని దేశాభిమాని యని శ్రీరాములు కీర్తిఁగొన్నాఁడు.

నెల్లూరులో హరిజన దేవాలయప్రవేశమును గుఱించి, ప్రచారము సేయుచున్నప్పు డాతఁడు పడినపాట్లు వర్ణనాతీతములై యుండెను. తలపై గొడుగులేక, పాదములకుఁ జెప్పు మెత్తలులేక, మండు టెండలలో నెల్లూరు పరిసర ప్రాంతాలలో "హరిజనులను దేవాలయములఁ బ్రవేశింపనిండు" అను పదము లట్టపై వ్రాసి, మెడకుఁ దగిలించుకొని

ప్రచారము సేయు చుండెడివాఁడు. అట్టి భారతీయ ప్రియుని, కొందఱు జూచి "ఈతని కేమో పిచ్చి" యని హేళన గావించిరి. స్వార్థరహితుఁ డగు మహితాశయుని ప్రకృతి భావము స్వార్థపరులకు గోచరింపదు కదా!

శ్రీరాములు నెల్లూరులో నున్నపుడు భిక్షాటన చేసి, సేవ గావించుచుండి, కొంత కాలమైనతరువాత దినమున కొక యింటికి భోజనమునకుఁ బోవుచుండెను. కొన్నిదినము లట్లు జరిగిన తరువాత నెల్లూరులో గొంతమంది కాతనిపై ప్రత్యేకాభిమాన ముదయించినది. అందుచే నాతఁ డుండు బసలో భోజనపు సదుపాయము లేర్పాటు కావించిరి.

నిర్మాణ కార్యక్రమమున సేవ గావింపఁ దలఁచిన శ్రీరాములకు "గాంధిస్మారకనిధి" కాంధ్ర సంచాలక పదవి కలిగినది. ఆ వృత్తిలో నున్నపుడు నెలకు నూఱుయేఁబది రూపాయల వఱకు వేతనము గైకొను నర్హత యున్నప్పటికీ, నెలకు ముప్పదిరూపాయలు మాత్రమే గ్రహించు చుండెను. అది తన నిత్యభోజనమునకు సరిపోవు చుండెడిది. సంచాలక పదవిలోనుండి దేశమున లక్షలాదిగా ద్రవ్య మార్జించెనే కాని, స్వంతమున కొక గవ్వయైన వ్యయింప లేదు.

ఖద్దరు గోరంచుధోవతి, పైన నొక యుత్తరీయము తప్ప డాబుగా దుస్తులను ధరించువాఁడుగాఁడు. తన కార్యక్రమమున కనుగుణ్యముగా వేదికల నుపన్యసించునే కాని, వ్యర్థముగా నొకపలుకైన భాషింప లేదు. ఆకలి మాన్పు

కొనుట కాహారము గైకొనుచుండెనే గాని, సత్త్వ సంపదకు గాదు.

"ఇహాపర రోగకారణములు భోగములే" యని యాయన యభిప్రాయము. అందుచే భోగములను దరికి రానీయలేదు. ఆయన సంసార సామగ్రియంతయుఁ దన కడ నుండు సంచిలో నిమిడి యుండెడిది. అంతటి స్వార్థ త్యాగి మఱి యెవ్వరుండఁబోరని క్రమముగా నెల్లూరి వారిలో గొందఱు గ్రహించిరి. అది మొదలు శ్రీరాములను, దమ తమ గృహములలో జరుగు గాంధిజీపూజల కాహ్వానించుచుండెడివారు. కొందఱిండ్లకు శ్రీరాములు స్వయముగా బోయి, సూత్రయజ్ఞము చేయించుచుండెడివాఁడు. స్వయముగా నూలు వడకుట యందు శ్రీరాములద్వితీయుఁడు. సూత్రయజ్ఞమునం దతఁ డసమాన ప్రతిభ నార్జించెను.

శ్రీరాముల యేకాగ్రత కొనియాడఁ దగినది. ఒక యంశమందు తన మనసు లగ్నమై యుండినచో, మఱొక దానిపై నెంతమాత్రముపోదు.

"నిష్కామముగా దేశసేవజేయుట మోక్షదాయకము. మానవసేవయే మాధవసేవ, దేశసేవయే దైవసేవ" యని శ్రీరాము లెవ్వరితో నంభాషించిన నట్లనుచుండెడు వాఁడు. కుటుంబముతో నాతనికి సంబంధములేదు. బాంధవులతో సంబంధములేదు. కాని, దేశముతో సన్నిహిత సంబంధమున్నది. ఇటువంటి దాయన దేశసేవా దురంధరత. సంఘముతో బాంధవ్యమున్నది. కాని దేశసేవకుఁ గొఱగాని

దానితో సంబంధ ముండెడిది కాదు. ఏ సంస్థయైనను దేశసేవా నిరతికిని, విశ్వమానవ కల్యాణమునకుఁ బాటుపడుచుండునో యట్టి సంస్థపై శ్రీరాముల కాదరము మెండు. అట్టి సంస్థతో సాహచర్యము మనసార నెఱపుచుండును.

దేశనాయకులందఱు తనవలె సర్వసంగ పరిత్యాగము చేసి, దేశసేవా పరాయణులుగా నుండవలెనని యాతని యభిమతము. అనాథు లెందఱికో తోడ్పడినాఁడు. వ్యాధిగ్రస్థుల కపారసేవ గావించినాఁడు. రాజకీయ రంగములో బాల్గొనుటయేగాక, దేశసేవ గావించుటే గాక, దేశమందలము గొని యున్న కొన్ని దురాచారములను నిర్మూలించు సంఘసంస్కర్త యనికూడఁ గొనియాడఁ బడినాఁడు శ్రీరాములు.

ఆంధ్రులకు గలుగుచున్న బాధలు గమనించుచుండెను. ప్రత్యేకముగా నాంధ్రులకు రాష్ట్ర మేర్పడినగాని వారి యిక్కట్టులు తొలఁగజాలవని దేశనాయకులతో ముచ్చటించినాఁడు. తదుద్యమునకై ప్రచారము సాగించినాఁడు. విద్యావంతులు, రాజకీయవేత్తలు, దేశనాయకులీ విషయమును గూర్చి దేశమున నాందోళన సాగించినారు. బహిరంగ సభలు కావించినారు. కొందఱు నిరశనవ్రతముగూడ గైకొని సాధింపఁ గడంగిరి.

ఆంధ్రుల యభీష్టము నెరవేఱఁగల శుభముహూర్తము దూరమగుచుండెను. ఇట్టి పరిస్థితిలో శ్రీరాముల హృదయమున నెద్దియో తళుక్కుమన్నది. ఆ మఱునాఁటినుండి “ఆంధ్రరాష్ట్రసిద్ధికై ఆమరణాంత ప్రాయోపవేశమునకుఁ”

గంకణము గట్టుకొన్నాఁడు. చంద్రునిలోనైన గళంక మున్నదికాని, నిష్కళంక జీవితము నెఱపుచున్న మహా వీరుఁడు, కార్యశూరుఁడు, త్యాగి, యాంధ్ర తపస్వి శ్రీరాములు తన దృఢసంకల్పము నిష్కళంకము. అందుకు దైవసహాయము తోడ్పడినది. అందుచే నంతవఱకు తాను బూనియున్న యాంధ్రసంచాలక పదవిని విరమించి, తత్సంబంధమైన విషయములన్నియు దేశనాయకుల కప్పగించినాఁడు.

అట్టి సమయమున నాతని మిత్రులలో ముఖ్యుఁ డరుదెంచి "మీ రుపవాస కఠోరదీక్ష మానకూడదా! ఆ మరణాంత ప్రాయోపవేశ మేల"యని ప్రశ్నించెను. అందులకు శ్రీరాములు చిఱునవ్వున "అయ్యా! ఇప్పుడట్టి దీక్ష కవసర మెంతైన గలదు. ప్రభుత్వముపై ద్వేషభావముతో నుపవాస మారంభించ లేదు. విలాసమునకు గాదు. అట్టి దిప్పుడు ప్రాణభీతికై మానవలసిన యగత్యము లేదు. ప్రజలకుఁ గ్రమముగా నహింసాసిద్ధాంతము మీఁద, సత్యాగ్రహ సిద్ధాంతము మీఁద బాపూజీ నిర్యాణాంతరము విశ్వాసము సన్నగిల్లినది. గాంధిజీ సిద్ధాంత విశ్వాసమును బునరుద్ధరింప, నా జీవితమును బూర్ణాహుతిగావించి, ఋజువు పఱచుటయు, దాని ననుసరించి, ప్రత్యేకాంధ్రరాష్ట్ర మేర్పడునంత దాఁక ప్రాయోపవేశదీక్షను విరమింపఁ జాలను" అని ఘంటాపథముగా బలికెను.

నాఁడు హరుని మెప్పించి, గంగను భూమికి దెచ్చి పితలఁ బునీతులఁ జేసిన భగీరథుని వలె శ్రీరాములు సోద రాంధ్రులకై రాష్ట్రమును సిద్ధింపఁ జేయ దృఢసంకల్పుఁ డై నాఁడని మిత్రు లూహించిరి. శ్రీరాముల యచంచల దీక్షకు వారు విస్మయులై యుండిరి.

కఠోరోపవాసమున దినములు జరుగుచుండఁగా, శ్రీరాముల శరీరపరిస్థితి క్రమముగా నీరసించుచుండెను. వైద్యులు, మిత్రులు చుట్టును జేరి, పలయు నుపచారములు సేయుచుండిరి. ఘడియఘడియకు వారు శరీరారోగ్యపరిస్థితిని బరీక్షించుచుండిరి. శ్రీరాముల సోదరుఁడు శ్రీ రంగయ్య గుప్తగారు యం. బి. బి. యస్. అసిస్టెంటు డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసరు పదవిలో జాలకాలము నెల్లూరులో నుండి, ప్రస్తుతము రాజమహేంద్రవరమున నుండిరి. శ్రీరాముల ప్రాయోపవేశము దెలియఁగనే వచ్చి దాపున నుండిరి.

తే19-10-1952ది మొదలు నేఁ బదియేఁడు దినముల విచ్ఛిన్నముగా సాగిన, యాంధ్రరాష్ట్ర సిద్ధికై యా మర ణాంత ప్రాయోపవేశదీక్ష యేఁబది యెనిమిదవ నాఁడు తే 15-12-1952 ది రాత్రి ఘ 11-23 లకుఁ బూర్తియైనది. శ్రీరామయోగి యాత్మ బలిదాన మొనరించి, యమరజీవి యైనాఁడు.

ఆయన కానాఁటి రాత్రి పదిగంటలకే స్పృహ తప్పి పోయినది. మిత్రులు వైద్యులు [illegible] చెంతనున్న శ్రీ బులుసు సాంబమూర్తిగారు [illegible] మహర్షి [illegible] కొన

సాగించుచు మహామహుఁడు, ఆంధ్రతపస్వి, తనువు చాలించి నాఁడు" అని పలికిరి. ఆత్మశాంతికై యచ్చట నున్నవారు శ్రీరామభజన గావించిరి.

అప్పటికి శ్రీరాముల కేఁబది రెండవ యేఁడు ప్రారంభించినది. జీవితపర్యంతము గాంధిజీ యడుగుజాడలలో తూ చా తప్పక నడిచిన మహావీరుఁడు, త్యాగియని వేలాది ప్రజలు భౌతిక దేహదర్శనార్థము వచ్చి వేనోళ్లఁ బొగడిరి.

స్వరాజ్య సంపాదనకై శరీర ప్రాణములు ధారవోసిన బాపూజీని గోల్పోయిన భారతమాత, ఆంధ్రరాష్ట్ర సిద్ధికై తనువు బలిదాన మొనర్చిన శ్రీరామయోగిని గోల్పోయిన యాంధ్రమాత, తోఁడి కోడండ్రై యుందురా! యని కొందఱు విజ్ఞానవేత్త లూహించి, సంతాప పడిరి.

శ్రీరాముల యనసానదశలో సాంబమూర్తిగారు, యన్. ఆర్. గుప్త, యం. రంగయ్యగారు. మోతే నారాయణరావుగారు., కామేశ్వర రావుగారు దగ్గఱ నుండిరి. ఆతని బలిదానమునకు ప్రకృతి చలించినది. దిన పత్రికలు వాపోయినవి. రాష్ట్రమం దెచ్చటఁజూచినను సానుభూతి సభలు గావింపఁబడినవి.

ఆ మఱునాఁడుదయము మైలాపూర్ వీరభద్రను వీధిలో నొకశాల నిర్మించి, యందు శ్రీరామయోగి కూర్చున్నట్లు భౌతిక దేహమును బుష్పమాలల నలంకరించి, ప్రేక్షకుల దర్శనార్థ ముంచఁబడినది. స్త్రీ పురుషాదులు

భజనసేయుచుండిరి. భౌతిక దేహమును దర్శింప, మంత్రులు, మిత్రులు, ధనికులు మున్నగు వారనేకులు వచ్చిరి.

శ్రీరాముల బలిదానవార్త తెలియఁగనే "నిర్వివాద ప్రాంతాలతో నాంధ్రరాష్ట్ర నిర్మాణమునకుఁ దగు చర్యలు కైకొనఁబడుచున్నవి." అని స్టేటు కౌన్సిలునుండి ప్రకటన వెలువడెను. ధర్మసంస్థాపనకు రెండు మార్గములు కలవు. మొదటిది బలప్రయోగము, రెండవది యాత్మబలిదానము. అందు రెండవది బలీయము. రాజ్యస్థాపనకు రెండు మార్గాలున్నవి. చంపి రాజ్యస్థాపన మొనరించుట మొదటిది. చచ్చి రాజ్యము స్థాపించుట రెండవది. ఇందును రెండవ మార్గము బలీయము. శ్రీరామయోగి యాత్మబలిదాన మాంధ్రరాష్ట్ర స్థాపనోద్యమమునకు దారి తీసినది.

ఆ మఱునాఁడు (తే 16-12-1952 ది) సాయంకాలమునకు శ్రీరాముల భౌతిక దేహమును శ్రీ కన్యకాపరమేశ్వరీ శ్మశాన వాటికకుఁ జేర్పఁ బ్రయత్నములు జరుగుచుండెను. ఒక స్యందనము నిర్మింపఁబడినది. దానిపై త్యాగవీరుని భౌతిక దేహము పుష్పమాలాలంకృతము గావింపఁబడి, యుంచఁబడినది. ఆనాఁటి మధ్యాహ్నమునకు సరిగా గం. 2-30 లకు బ్రహ్మాండమైన యూరేగింపుతో రథము బయలుదేరినది. చూపఱకాతని మూర్తి తపోముద్రలో నున్నట్లు గోచరించినది. నిర్మలము, ప్రశాంతము, భావగంభీర మాతని మూర్తియందుఁ బ్రతిఫలించుచుండెను.

కళాలల యాంధ్ర విద్యార్థులా తేరు లాఁగుచుండిరి. భజన ధ్వనులు మిన్నుముట్టుచుండెను. దశదిశలు మాఱు మ్రోఁగునట్లు "ఆంధ్రరాష్ట్రము కావాలి" అని నినాదము లుప్పతిల్లెను.

ఆంధ్రరాష్ట్ర గానముతో పొట్టి శ్రీరామయోగి మహా ప్రస్థానము ప్రారంభమైనది. భౌతికశరీరము పంచభూతములతో మేళవించినది. ప్రశాంత వాతావరణములో నచ్చట మూఁగియున్న ప్రజానీకము శ్రీరామ భజ గావించిరి.

శ్రీరామయోగి సోదరాంధ్రులకు బలిదానమొనర్చి స్వర్గసీమ నలంకరించినాఁడు. దేవతాంగనలు నీరాంజ ముతో స్వాగత మిచ్చిరి. అచ్చట కస్తూరిబా బాపూ లతో, సరోజనీదేవితో, పటేలు మున్నగు దేశనాయకులతో శ్రీరామయోగి మహానందమున జేతులు కలిపినాఁడు ఆయన పవిత్రాత్మ శాంతించుగాక!

